ఓ౩మ్



# కేనోపనిషత్తు

( ఆంధ్ర టీకా తాత్పర్య సహితము )



"వేదవేదాంగ" బిరుదాంకితులు

కళాప్రపూర్ణ పండిత గోపదేవ్



ప్ర కా శ కు లు :

ఆర్యసమాజము

కూచిపూడి 522 313

తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా

అంబా దర్శన గ్రంథమాల - ౧౪
పంచమ సంస్కరణము - ౪౦౦౦

సర్వస్వామ్యములు : ఆర్యసమాజము - కూచిపూడి

జూన్ 1995

మూల్యము : రూ. 6.00

ప్రతులకు :

1) ఆర్యసమాజము, కూచిపూడి - 522 313.

2) మాశెట్టి వేంకటేశ్వరరావు,
3-3-738, కంచరి బజారు, సికింద్రాబాదు-500 003.

3) వైదిక సాహిత్య భండారు,
ఆర్యసమాజ్, సుల్తాన్ బజార్, హైద్రాబాదు.

అశ్విని ప్రెస్, సికింద్రాబాద్.

# సంపాదకీయము

మహర్షి దయానందునకు పూర్వము ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము అను నాలుగే వేదములు గాక వాని వివరణ గ్రంథములగు బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులను గూడ వేదములుగా నంగీకరించి ప్రచారము చేయుచున్న రోజులలో మహర్షి దయానందుడు ఋగ్వేదాదులు నాలుగు మాత్రమే వేదములనియు, మిగిలినవి వేద మంత్రార్థ వివరణము అనియు సప్రమాణముగా వెల్లడించి భ్రాంతిని తొలగించిరి. ఉపనిషత్తులను వేదాంత గ్రంథములుగా చెప్పుటకు కారణము - ఉపనిషత్తులలో మొదటిది యగు ఈశావాస్యోపనిషత్తు యజుర్వేదములో చివరిది యగు 40 వ అధ్యాయమే. అది యొక్కటి వేదము యొక్క అంతమైన మాత్రమున ఉపనిషత్తులన్నియు వేదాంతము అనుట వారి భ్రమయే.

ఈ కేనోపనిషత్తునకు తలవకారోపనిషత్తనియు పేరు కలదు. ఈ రెండునామములు కలుగుటకు కారణము ఈ యుపనిషత్తునకు మొదట "కేనేషితం" అని ప్రారంభించుటచే కేనోపనిషత్తనియు. సామవేదములోని తలవకారశాఖలోని

తొమ్మిదవ యధ్యాయమే యీ కేనోపనిషత్తు. అందుచే తలవకారోపనిషత్తనిరి. దీనిలో గురువు, శిష్యుడు సంవాదము చేయుచు బ్రహ్మమును గూర్చియు, దాని మహిమలను గూర్చియు, దానిని పొందుటకు వలసిన సాధనముల గూర్చియు వివరముగా చర్చించిరి.

ఈ పుస్తక ప్రచురణకు కాకినాడ వాసులైన వాసంసెట్టి రామకృష్ణారావు గారు, కృష్ణాజిల్లా రావివారి పాలెం నివాసులు సజ్జా రాంబాబు గారు, వారి మామగారైన కీ.శే. గవిని వెంకట సుబ్బయ్యగారి జ్ఞాపకార్థము వెయ్యిరూపాయల చొప్పున ధనమొసంగిరి. వారి దాతృత్వమునకు అంబాదర్శన గ్రంథమాల కూచిపూడి వారు కృతజ్ఞతను దెల్పుచున్నారు.

– వెంకయ్యార్య.

# తొలిపలుకులు

భారతీయులు చరిత్రకందని కాలమునుండియు వేద విహిత ధర్మములను కర్తవ్యములుగా నెంచి యాచరించుచుండువారు. వారిదృష్టిలో వేదములు ఈశ్వరీయములు. పరమేశ్వరుడు మానవులకు ఆది గురువు. ఆది మానవుల శుద్ధాంతఃకరణములందు జ్ఞానమును ప్రతిభాసింప జేసినవాడు.

మానవుల జ్ఞానము స్వయముగ వికసించునది కాదు. అది పర సాహాయ్యమును బొంది వృద్ధి జెందును. తల్లిదండ్రులు తమ బిడ్డల జ్ఞానవికాసమునకు 'దోడ్పడుదురు. గురువులు శిష్యుల జ్ఞానవృద్ధికి సహాయకులగుదురు. అట్లే సృష్టిప్రారంభమున మానవులకు పరమేశ్వరునివలన లభించిన జ్ఞానమే వేదములు. కావుననే యవి యీశ్వరీయములు - అపౌరుషేయములు, నిత్యములు నని యెంచబడుచున్నవి.

వానిలో మానవులకు కావలసిన విజ్ఞానమంతయు బీజరూపమున బోధింపబడినది, ఈశ్వరుడు సర్వజ్ఞుడు. కావున నీశ్వరీయ జ్ఞానము నిర్భ్రాంతము. కావుననే వేదవిహిత కర్మములు ధర్మములు. వేదనిషిద్ధములు అధర్మములు- అకర్తవ్యములును.

ఈ వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము. వీనికి ఛందస్సులనియు, మంత్ర సంహితలనియు నామాంతరములు, ఋషులు తమకు సమాధ్యవస్థయందు లభించిన-భాసించిన యీ మంత్రములను అర్థ సహితముగ గ్రహించి శిష్యులకు బోధించుచు వచ్చిరి.

సమాహితులై మంత్రములను, మంత్రార్థములను సాక్షాత్తుగా నెఱుగ జాలని వారికి వేదార్థములు బోధపడుటకుగాను, మహర్షులు శతపథము, గోపథము, ఐతరేయము, తాండ్యము నను నామములతో వేదములకు వ్యాఖ్యాన గ్రంథములు రచించిరి. ఈ గ్రంథములకు బ్రాహ్మణములని నామము. వేదమునకు బ్రహ్మము అని నామము. బ్రహ్మమునకు వ్యాఖ్యానము బ్రాహ్మణము అనబడును. ఇంకను వేదార్థములను ప్రచారము చేయు నిమిత్తము అరణ్యకము లను నామముతో కొన్ని గ్రంథములు మహర్షులు వ్రాసియున్నారు.మఱియు వారు ఆధ్యాత్మిక విషయములకు సంబంధించిన తమ యనుభవములను దెలుపుటకును కొన్ని గ్రంథములు వ్రాసియుండిరి. వానికి ఉపనిషత్తులని నామము. బ్రహ్మవిద్య యనియు వానికి నామాంతరము. కేనోపనిషత్తు, కఠోపనిషత్తు మున్నగు ద్వాదశ ఉపనిషత్తులు సంస్కృత సాహిత్యమున నతి ప్రసిద్ధములు. ఇట్లు బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు నను ముప్విధ గ్రంథ సాహిత్యము ఋషిప్రోక్తము.

ఈశ్వర ప్రణీతములయిన వేదములు, ఋషి ప్రణీతములయిన బ్రాహ్మణాదులు అన్నియు నేడు వైదిక వాఙ్మయమనియు, మిగిలిన సంస్కృత సాహిత్యమంతయు లౌకిక వాఙ్మయమనియు విభజించి వ్యవహరింపబడుచున్నది. కాని, వేదములుమాత్రము ఈశ్వరీయములగుటచే స్వతః ప్రమాణములనియు, ఋషిప్రోక్తములగు బ్రాహ్మణాది ఇతర గ్రంథములన్నియు పరతః ప్రమాణములనియు శిష్టు లంగీకరించియున్నారు.

కాని, కాలము గతించినకొలది భారతదేశమున వేద ప్రచారము సన్నగిల్లినది. వెదవిహిత ధర్మాచరణము కూడ క్షీణించినది. వేదబోధిత మార్గమును విడిచి ప్రజలు నానా విధములగు నాచారవిచారములను గ్రహించి అవైదికులయిరి. అవైదికాచారములను, మతములను వ్యాపింపజేయు విద్వాంసులు తమ మతములను, ఆచారములను వేదవిహితములు గానే చెప్పుచు ప్రజలను పెడదారులం బెట్టిరి.

దేశమున నేడు మిక్కలి వ్యాపకములో నున్న విగ్రహారాధనము, జడపూజనములు, బలిదానములు, పశువులను హింసించి చేయు యజ్ఞములు, అద్వైతాది మతములు నన్నియు వైదికములు కావు. కాని, వేదముల పేరిట చెల్లుబడి యగుచున్నవి. నేటి విద్వాంసులు కూడ పెక్కురు పై విషయములు వేదప్రతిపాదితములు కావని యెఱుగరనిన చదువరులకు ఆశ్చర్యము కలుగును. రాగద్వేషాదులతో కూడిన విద్వాంసులచే వ్రాయబడిన పురాణాదుల మూలమున పై విషయములన్నియు మానవులలో వ్యాపకము అయినవి.

ఉదాహరణమునకు అద్వైతమతమును - సంప్రదాయమును గ్రహింపుడు. ఇప్పటివారందఱు నీ మతము వైదికమత మనియే యెంచుచున్నారు. కాని, వాస్తవమున అద్వైతము-జీవేశ్వరులలో భేదములేదు, అను మతము వేదవిహితము కాదు. శ్రీ శంకరులు, వారి గురువులు నెల్లరు అహం బ్రహ్మాస్మి" "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యముల నాధారముగ తీసికొని అద్వైతమతమును ప్రచారము చేసియున్నారు. పై వాక్య

ములు వేదవాక్యములుగా విద్వాంసులు కూడ భావించి, వానిచే ప్రతిపాదింపబడిన మతము కావున "అద్వైతము" వేద మత మని నమ్ముచున్నారు. వేదమత మనియే యెంచి పలువురు దానియందు నిష్ఠగలిగి యున్నారు. కాని, వాస్తవమున పై వాక్యములు వేదవాక్యములు కావు. అయ్యవి ఋగ్యజుస్సామాథర్వములలో నెక్కడను కానరావు. అయ్యవి ఉపనిషత్తులలోనివి. అద్వైతము పై వాక్యములకు ప్రతిపాద్యమగుట సత్యమే యగునెడల నది ఉపనిషన్మతమగును; కాని వేదమత మెన్నడును కాజాలదు. ఈ వాక్యములకు ప్రతిపాద్యము అద్వైతమా, విశిష్టాద్వైతమా, ద్వైతమా త్రైతమా యనునది విచారణీయము. ఆ యా ఉపనిషత్తులలో నా యా వాక్యములు వచ్చినచోట వాని యర్థములు విచారింపబడును. వేదమంత్రములలో అద్వైతము కనిపింపదు. జీవేశ్వరులు భిన్నులనిచెప్పు మంత్రములు వేదములలో నెన్నియో యున్నవి.

ఇట్లే విగ్రహారాధన, యజ్ఞములలో పశుహింస మున్నగునవి వేద విహితములు కావు.

ఆచార్యులు అద్వైతము వేదమతమని యేల ప్రచారమొనర్చియుందురు? అని ప్రశ్నింతురేని, అందులకు కారణము వేదములపై ప్రజలకుగల విశ్వాసమే. వేదమతమునే ప్రజలు సులభముగా నంగీకరింతురు. వేదము లీశ్వరీయము లగుటచే వేదమతము భారతీయుల కంగీకార్యమగును. ఇతరము కాదు.

కేన, కఠ, ముండకాది ఉపనిషత్తులు వేదములు కావనియు, అవి మహర్షి ప్రణీతములనియు నిదివఱకే వ్రాసియున్నాము. అయినను ఈ సత్యమును మఱచి విద్వాంసులు

ఉపనిషత్తులు వేదముల యంతిమ భాగములే యనియు, అందువలన నవియు వేదములే యనియు నెంచుచున్నారు. వేదముల పేరిట తమ మతములను, తమ యాచారములను చెల్లుబడి చేసికొనుటకుగాను విద్వాంసులు బ్రాహ్మణములను, అరణ్యకములను, ఉపనిషత్తులను కూడ వేదభాగములని మధ్యకాలమున జెప్పదొడగిరి. అందులకై శ్రౌత సూత్రాది గ్రంథములలో—

## మంత్రబ్రాహ్మణ యోర్ వేద నామధేయమ్

"మంత్రములకు బ్రాహ్మణములకు వేదము నామధే యము" అని సూత్రములను కూడ రచియించి వానిని ప్రచార మునకు తెచ్చియున్నారు. వ్యాఖ్యాన గ్రంథములు మూలము లెట్లగును? ఋషి ప్రణీతములయిన కేనాది ఉపనిషత్తులు ఈశ్వరీయములైన వేదము లెట్లు కాగలవు? ఉపనిషత్తులలోని వాక్యములు పరతః ప్రమాణములు కాబట్టి వానిని వేదాను కూలముగ వ్యాఖ్యానము చేసికొనవలయును. వేద ప్రతిపాదిత సిద్ధాంతములకు విరుద్ధముగ ఉపనిషత్తుల కర్థముచెప్పుట శిష్ట సంప్రదాయమునకు విరుద్ధము.

వేదములకు, ఉపనిషత్తులకు గల యంతరము విద్వాం సులు కూడ విస్మరించిరి. వ్యాస, జైమిని ప్రభృతి ఋషులకు తదుపరి వచ్చిన విద్వాంసులు ఈశ్వరీయవేదములకు, ఆర్షము లగు బ్రాహ్మణాదులకు గల భేదమును గుర్తింపక బ్రాహ్మణ ములు, ఉపనిషత్తులు, అరణ్యకములు, ఉపనిషత్తులు నన్నియు వేదములే యని యెంచసాగిరి. పైపెచ్చు ఉపని షత్తులు వేదములకంటె నుత్తమములనియు చెప్పుటకు వెను

కాదరైరి. పందొమ్మిదవ శతాబ్దమున దయానంద మహర్షి (ఆర్యసమాజ స్థాపకులు) మరల వేదములు ఈశ్వరీయము లనియు, బ్రాహ్మణాది ఉపనిషదంత సాహిత్యము అర్షము - ఋషి ప్రణీతమనియు చెప్పి సత్యమును వెల్లడించియున్నారు.

కావున ఈ కేనోపనిషత్తు ఆర్షసాహిత్యమునకు చెందిన గ్రంథమని పాఠకులు గుర్తింపవలయును.

"కేనేషితం పతతి ప్రేషితం మనః" అను వాక్యముతో నీ యుపనిషత్తు ప్రారంభమగుటచే దీనికి "కేనోపనిషత్తు" అని పేరు వచ్చినది. దీనికి "తలవకారోపనిషత్తు" అని యు నామాంతరము.

సామవేదమునకు(౧౦౦౦)సహస్ర శాఖలున్నట్లు వినికిడి. ఆ శాఖలలో తలవకార శాఖ యొకటి. అందు తొమ్మిది యధ్యాయములున్నవి. చివరి యధ్యాయమే యీ కేనోపనిషత్తు. ఇందు గురుశిష్య సంవాదపద్ధతిలో బ్రహ్మము, దాని స్వరూపము, దానిమహిమ, బ్రహ్మప్రాప్తికి సాధనములు—నన్నియు బాగుగ వివరింపబడినవి.

పాఠకు లీ తెలుగు వ్యాఖ్యానమును జదివి ఉపనిషదర్థమును సులభముగ గ్రహింపగలుగుదురు. మూలమునగల ప్రతి పదమునకు సూటిగ అర్థము అన్వయక్రమము ననుసరించి వ్రాసితిమి. అనంతర వివరణ వాక్యములలో ఉపనిషత్కర్త తాత్పర్యము విపులముగ వ్రాయబడినది. చదువరులు శ్రమయనక ఆమూలాగ్రము దీనిని జదివి గుణదోషములను వివేకించి గుణములు గ్రహింపగోరుచున్నాడ.

— గోషదేవ్

ఓమ్

# కేనోపనిషత్తు

కేనేషితం పతతి ప్రేషితం మనః
కేన ప్రాణః ప్రథమః ప్రైతియుక్తః
కేనేషితాం వాచ మిమాం వదంతి
చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి. ౧

మనః=సంకల్ప వికల్పముల నొనర్చు మనస్సు. కేన=ఏ కారణముచే, ప్రేషితం = ప్రేరేపింపబడి, ఇషితం = కోరిన విషయమును, పతతి=పొందుచున్నది?, కేన=ఏ కారణముచే, యుక్తః=తన కర్మమున నియుక్తమై, ప్రథమః=శరీరమునందు గల నేత్రాద్యవయవములందు వ్యాపించియుండు, ప్రాణః = ప్రాణవాయువు, ప్రైతి=తన వ్యాపారముల నొనర్చుచున్నది?, కేన=ఎవనిచే-ఏ కారణముచే,ఇషితాం=నియమితమైన,ఇమాం వాచం=ఈ చెవితో గ్రహింపబడు వాక్కును,వదంతి=(జనులు) చెప్పుచున్నారు?, కః ఉ దేవః=ఏ దేవుడు, చక్షుః=నేత్రమును, శ్రోత్రం = చెవిని, యునక్తి = యుక్తము చేయుచున్నాడు-జోడించుచున్నాడు ?

ప్రాణులకు త్వక్కు, నేత్రములు, చెవులు, జిహ్వ, నాసిక యను నైదింద్రియము లున్నవి. వీనిలో త్వగింద్రియము వలన స్పర్శజ్ఞానము,నేత్రములవలన రూపము-రంగుజ్ఞానము, చెవులవలన శబ్దజ్ఞానము, జిహ్వవలన రసజ్ఞానము, నాసికవలన

గంధజ్ఞానము జీవులకు గలుగును. కావున వీనికి జ్ఞానేంద్రియములనియు నామము. ఇయ్యవియే కాక వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ యను నామములుగల యైదు కర్మేంద్రియములును ఉన్నవి. వీనితో క్రమముగ మాటలాడుట, పట్టుకొనుట, నడచుట, మలమూత్ర విసర్జనముల నొనర్చుట యను కర్మము లాచరింపబడును. మఱియు మన శరీరములందు మనస్సను నొక యంతరింద్రియముగూడ నున్నది. ఇంతేకాక మన శరీరములందు వాయువు భిన్నభిన్న స్థానములందు వ్యాపించియుండి, ప్రాణమనబరగి నానావిధక్రియల నొనర్చుచుండును. మనస్సుతో జీవుడు సంకల్ప వికల్పముల నొనర్చుచుండును. అందువలననే మనస్సు సంకల్ప వికల్పాత్మక మనబడును.

సాధారణముగ నీ యింద్రియములతో జీవుడు లోకమున వ్యవహరించుచుండును, కాని, పై ఉపనిషద్వచనమునందు 'మనస్సెవ్వనిచే ప్రేరితమయి కోరిన విషయమును జేరుచున్నది? అట్లే ప్రాణ మెవనిచే నియుక్తమై శరీరమున తన కార్యమొనర్చును? మనుజు లెవనిచే నియతమైన వాక్కునుపయోగించుచున్నారు? ఈ నేత్రాదీంద్రియముల నే దేవుడు వాని వాని కార్యములందు నియుక్త మొనర్చినాడు?' అను ప్రశ్నలు కనిపించుచున్నవి. ఈ ప్రశ్నల యభిప్రాయమేమి? జీవుడు తన యింద్రియములను మనస్సు మూలమున ప్రేరేపించి వానితో నా యా కార్యముల నొనర్చుచుండుట స్పష్టమగుచుండగా పై ప్రశ్నలలోగల సారమేమి? అని పాఠకులకు జిజ్ఞాస కలుగుట సహజము.

జీవుడు తన యింద్రియముల నుపయోగించి చూచుట, వినుట మున్నగు నా యా వ్యాపారముల నొనర్చుచుండుట వాస్త

వమే. పై ప్రశ్నల యభిప్రాయము ఇంద్రియముల నుపయోగించువా డెవడని యడుగుటకాదు. మనస్సు మున్నగు నింద్రియముల నవి యొనర్చు పనులకు దగిన స్వభావములు గలవిగ నిర్మించిన (దేవుడు) దివ్యగుణములుగల తత్త్వమెయ్యది? అని యా ప్రశ్నల కభిప్రాయము. మనస్సు జీవుల కభిమతములగు విషయముల వంకకు బరుగులెత్తును. దాని కా స్వభావము జీవు డొసంగినదికాదు. అట్లే నేత్రములు రంగులను, రంగులుగల వస్తువులనే తెలిసికొనగలవు. గంధమును గ్రహింపజాలవు, నాసిక గంధమునే గ్రహింప నుపయోగించును. రసమును గ్రహింప దోడుపడదు. ఇట్లే యితరములగు నింద్రియములుకూడ నియతపదార్థములను గ్రహియింప జీవునకు సాధనములగుచున్నవి జీవుడు వాని నట్లు నిర్మించినవాడు కాడు. అతడు వాని స్వభావముల నందువలననే మార్పను జాలడు. కావున నా యింద్రియముల నట్టివిగా నిర్మించిన దేవు డెవడు ? అని పై ప్రశ్నల యభిప్రాయము.

ఇంతేకాక మనశరీరములందు ప్రాణము నామముతో బేర్కొనబడునది యొండుకలదు. అయ్యది యైదు విధములుగను, పదివిధములుగను నుండునట్లును శాస్త్రములందు వ్యవహరింపబడును. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము నని పంచవిధప్రాణ నామములు. ప్రాణము హృదయస్థానమున నుండును. అపానము గుదమందును, వ్యానము శరీరమునం దంతటను, ఉదానము కంఠదేశముననను, సమానము నాభియందును నుండును. ఈ ప్రాణములన్నియు జీవుని యధీనమున నుండకయే వానికి నియతములైన కార్యముల నొనర్చుచుండును. ఈ ప్రాణములు మరణసమయమున జీవు

నితోబాటు శరీరమును విడిచివెళ్ళును. ఇట్టి ప్రాణము శరీరమును విడిచి జీవునివెంట వెళ్ళునట్లు నియమించు దేవుడెవడు? అనియు పై ప్రశ్నలలో నొక ప్రశ్న.

ఈ ప్రశ్నలకు సమాధానము క్రింది వాక్యములలో జూడుడు.

శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో
యద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చక్షుష శ్చక్షు రతి ముచ్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి. ౨

యత్ = ఎవడు-ఏ దివ్యపదార్థము, శ్రోత్రస్య = చెవికి, శ్రోత్రం=చెవియో, మనసః=మనస్సునకు, మనః = మనస్సో, వాచః=వాక్కునకు, హ=నిశ్చయముగ, వాచం (వదంతి)= వాక్కుగ చెప్పుదురో, చక్షుషః=నేత్రమునకు, చక్షుః=నేత్రమో, స ఉ=అతడే-ఆ దివ్యశక్తియే, ప్రాణస్య = ప్రాణమునకును, ప్రాణః=ప్రాణము, ధీరాః=ధ్యానశీలురైనవ్యక్తులు, అతిముచ్య =ఇంద్రియాదుల సంగమును విడిచి, అస్మాత్ లోకాత్=ఈ లోకమునుండి, ప్రేత్య=విడివడి, అమృతాః = అమరులు - ముక్తులు-మరణ విముక్తులు, భవంతి=అగుదురు.

శబ్దశ్రవణము చేయుట కనువైనది కావున చెవికి శ్రోత్రమని నామము. దాని కట్టి శక్తి నిచ్చి, దానిని రక్షించునది బ్రహ్మము; జీవుడు కాదు. అందువలన నా బ్రహ్మము శ్రోత్రమునకు శ్రోత్ర మనబడును. అట్లే మనస్సునకు సుఖదుఃఖములను దెలిసికొను శక్తినిచ్చినదియు బ్రహ్మమే. నేత్రమునకు రూపమును గ్రహించుశక్తి నొసంగినదియు బ్రహ్మమే. వాగిం

ద్రియమును మాటలాడుట కనువుగ చేసినదియు బ్రహ్మమే. ప్రాణమునకు గతిని గలిగించినదియు నా బ్రహ్మమే. నేత్రాదీంద్రియముల నన్నిటిని పంచభూతాత్మకమగు నీ ప్రపంచమును గ్రహించుటకు వీలగునట్లు నిర్మించినది బ్రహ్మపదార్థమే యని భావము. పృథివ్యాది భూతములు గంధాది విశేష గుణములు కలిగియున్నవి. వానిని వేఱువేఱుగ గ్రహించుట కనువుగ నైదింద్రియములను నిర్మించి. వానిలో నొక్కొక్కటి యొక్కొక్క భూతమును గ్రహించుశక్తి గలదిగ నియత మొనర్చినది బ్రహ్మమే యని భావము. అందువలననే నేత్రము రూపమును, చెవి శబ్దమును. నాసికగంధమును, జిహ్వ రసమును, త్వక్కు స్పర్శను మాత్రమే గ్రహించును. నేత్రాదీంద్రియములు రూపాదులను గ్రహించునట్లు నియమించినది బ్రహ్మమే. అందువలన నవి నియమిత కార్యములనేచేయును. కాని, బ్రహ్మము నవి గ్రహింపనేరవు. జీవుడు ఇంద్రియాదులతో గూడిన శరీరముతో బద్ధుడై యీ లోకమున వర్తించును. ఈ బంధనమునుండి విడివడుటకు జీవులు ధ్యానశీలురు కావలయును. జీవితకాలముననే ధ్యానబలముతో ఇంద్రియముల సంసర్గమును విడిచి, మరణానంతరమున నమరులు కాదగుదురని మంత్రాభిప్రాయము. జీవులు ముక్తులగుటకు ధ్యానము వారికి సాధనమనియు నిందు సూచింపబడినది· జీవులు ధ్యానింపవలసిన దెయ్యది? ఇంద్రియములను నిర్మించి. వానికి నియత శక్తుల నొసంగి, వానిని నియమించి రక్షించుచు,వానిచే బద్ధముకాని పదార్థమొండు కలదనియు నీశ్లోకమున దెలుపబడినది. కావున నా పదార్థమునే ధ్యానించి జీవులు ముక్తులగుదు రనియు నూహింపనగును. ఈ విషయమే రాబోవు పంక్తులలో జూడనగును;

న తత్ర చక్షుర్ గచ్ఛతి, న వాగ్గచ్ఛతి
నో మనో న విద్మో న విజానీమో
యథైత దనుశిష్యా దన్యదేవ తద్విదితా
దథో అవిదితాదధి ఇతి శుశ్రుమ
పూర్వేషాం యే న స్తద్ వ్యాచచక్షిరే. 3

తత్ర = ఆ బ్రహ్మము విషయమున, చక్షుః = నేత్రము, న గచ్ఛతి=వెళ్ళదు-పనిచేయదు. వాక్=వాక్కు, న గచ్ఛతి= వెళ్ళదు, మనః=మనస్సు, నో=వెళ్ళదు, న విద్మః=మనమెఱుగము, న విజానీమః=విశేషముగను నెఱుగము, ఏతత్ = ఈ బ్రహ్మమునుగూర్చి, యథా=ఎట్లు, అనుశిష్యాత్ = శిష్యాదుల కుపదేశింపవలయును?, తత్=ఆ బ్రహ్మము,విదితాత్=తెలిసిన దానికంటె, అన్యదేవ=భిన్నమే, అథో=మఱియు, అవిదితాత్= తెలియనిదానికంటెను. అధి=మించియున్నది, ఇతి=ఇట్లు, పూర్వేషాం=పూర్వులయొక్క వాక్కులను, శుశ్రుమ=మేము వినియున్నాము, యే=ఆ పూర్వాచార్యులు, నః=మనకొఱకు, తత్=ఆ బ్రహ్మమును గూర్చి, వ్యాచచక్షిరే = వ్యాఖ్యానము చేసియున్నారు.

ఇందు ప్రథమ వాక్యములలో చక్షువు, వాక్కు, మనస్సు నను మూడింద్రియములు బ్రహ్మమును చేరలేవు, అని వర్ణింపబడినది. చక్షువు జ్ఞానేంద్రియము. వాక్కు కర్మేంద్రియము. మనస్సు అంతరింద్రియము. జీవుడు చక్షురాది జ్ఞానేంద్రియములతో లోకమునగల పదార్థముల నెఱుగగలుగుచున్నాడు. కర్మేంద్రియములతో పనులను - గ్రహణాదుల నొనర్చును. అంతరింద్రియమగు మనస్సుతో సంకల్ప వికల్పములను

జేయును. సుఖదుఃఖముల నెఱుగును. ఇతర ఇంద్రియముల మూలమున నెఱిగిన వానిని స్మరియించును.

జీవుడు తనకుగల యీ సాధనములతో బ్రహ్మము నెఱుగ జాలడని ఉపనిషద్ వచనముల యభిప్రాయము. కారణ మేమన: చక్షువురూపమును, రూపముగల వస్తువులను మాత్రము గ్రహియింప సాధనము. బ్రహ్మమునందు రూపము లేదు. కావున చక్షువున కట గతిలేదు-చక్షువు బ్రహ్మము నెఱిగింప సాధనముకాదు. నేత్రమున కది తెలియకపోయినను మిగిలిన చెవి, నాసిక, జిహ్వ, త్వక్కు అని చెప్పబడు జ్ఞానేంద్రియముల కది తెలియబడునందుమేని, వానికిని నది యుండదు. ఆ యింద్రియములును క్రమముగ శబ్దము, గంధము, రసము, స్పర్శము గల వస్తువుల నెఱిగింపగలవే కాని, ఆగుణములు లేనివానిని దెలుపజాలవు. శబ్దస్పర్శరూపరసగంధములలో నొక్కటియు బ్రహ్మమున లేదు. కావున జ్ఞానేంద్రియములకు బ్రహ్మము విషయముకాదు-వానిచే తెలియబడదు. ఈ విషయమునే శ్లోకమునందలి 'న తత్ర చక్షుర్ గచ్ఛతి' అను వాక్యము స్పష్టము చేసినది. చక్షువు (నేత్రము) మిగిలిన జ్ఞానేంద్రియములకు ఉపలక్షకము-సూచకము.

నేత్రాది జ్ఞానేంద్రియములకు అందని వస్తువు వాగాది కర్మేంద్రియములకు పట్టువడనేఱదని వేఱుగ జెప్పనక్కఱ లేదు. అయినను 'న వాగ్గచ్ఛతి' 'వాక్కున కది విషయము కాదు-బ్రహ్మము కర్మేంద్రియములకు పట్టువడునది కాదు' అని స్పష్టము చేయబడినది. ఇక్కడ వాక్కు తక్కిన కర్మేంద్రియములకు ఉపలక్షకము-సూచకముఅని తెలిసికొనవలయును.

ఇక జీవునకు గల జ్ఞానసాధనములలో ముఖ్యమైన సాధనము మనస్సు. ఇయ్యది యితరేంద్రియములతో కలిసి, పదార్థముల నెఱుగుటకును, పనులు చేయుటకును జీవునకు తోడ్పడును. జీవునిచే ప్రేరితమై మనస్సు జ్ఞానేంద్రియములతో జేరియది పనిచేయును. అంతేకాక ఇంద్రియముల మూలమున నెఱిగిన వస్తువులను స్మరియించుటకును, జీవునకు సుఖముల నొసంగు పదార్థములను గోరుటకును, దుఃఖముల నిచ్చు వస్తువులను నిరాకరించుటకును నిది సాధనమగును. మఱియు నియ్యది జీవునకు గలుగు సుఖదుఃఖముల నెఱుంగుటకును సాధనమగును. ఇట్టి యీ మనస్సునకును బ్రహ్మమందదు, అని ఉపనిషద్ వచనము చెప్పుచున్నది.

ఇట్లు కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు అంతరింద్రియమగు మనస్సు నన్నియు బ్రహ్మము నెఱుగుటకు సమర్థములు కాకపోవుటచేతనే యుపనిషద్ వచనము 'న విద్మో, న విజానీమో' = 'సామాన్యముగ కాని, విశేషముగ గాని బ్రహ్మమును మన మెఱుగజాలము' అని చెప్పుచున్నది.

మనమేదేని యొకవస్తువును ప్రథమమున నెఱుగునపుడు -ఇంద్రియములతో నా వస్తువునకు సంబంధము కలిగినపుడు, అది యేదో యొక వస్తువు అని మాత్రము తెలియును. ఈ తెలివినే సామాన్యజ్ఞాన మందురు. అనగా ప్రథమమున నింద్రియములచే వస్తువు సామాన్యముగ దెలియబడు నని భావము. అటుపై నా వస్తువును విశేషముగ దెలిసికొందుము. అప్పుడు విశేషజ్ఞానము గలుగును. ఉదాహరణము : మన మొక వ్యక్తిని జూచునపు డా వ్యక్తి ప్రథమమున మనుష్యుడుగానో, పశువుగానో తెలియును. తరువాత నా వ్యక్తి మనుజుడైనచో

వెంకయ్యగానో, సుబ్బయ్యగానో, లేక భారతీయుడుగానో, ఇంగ్లీషువాడుగానో లేక మఱియొక దేశవాసుడుగానో తెలియబడును. పశువైన పక్షమున ఆవుగానో, మేకగానో, గుఱ్ఱముగానో తెలియనగును. ఇట్లు వస్తుజ్ఞానము మొదట సామాన్యముగను, తరువాత విశేషముగను గలుగును. బ్రహ్మము మాత్రము మనకు సామాన్యముగగాని, విశేషముగగాని తెలియబడదని పై వాక్యాభిప్రాయము (న విద్మో న విజానీమః).

అటులయిన గురువులు శిష్యులకు బ్రహ్మమునుగూర్చి యెట్లుపదేశింపగలరు? అను ప్రశ్న ముదయించును. గురువులును దమకు సామాన్యముగగాని, విశేషముగగాని తెలియని దాని నుపదేశించు టెట్లు? ఈ సంశయమును దీర్చుటకుగాను ఉపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది ''పూర్వాచార్యుల వ్యాఖ్యానముల ననుసరించి 'ఆ బ్రహ్మము విదితముకంటెను, అవిదితముకంటెను భిన్నమే యని మేము వినియున్నాము" అని గురువులు శిష్యుల కుపదేశింపవలయును.

ధ్యానశీలురైన యాచార్యులు బుద్ధితో బ్రహ్మము నెఱుగుటకు సమర్థులగుదురు. బ్రహ్మము ధ్యానగమ్యమే కాని, యింద్రియ గమ్యము కాదని గ్రహింపనగును. మనస్సు సత్యశౌచాద్యాచారములవలనను, ధ్యానాద్యభ్యాసములవలనను క్రముగా శుద్ధమై యేకాగ్రమగును. అప్పు డది సూక్ష్మపదార్థములను గ్రహియింప సమర్థమగును. సాధారణమగు మనస్సునకట్టి సామర్థ్యముండదు. సమాహిత (ఏకాగ్రమైన) మనస్సు బుద్ధి యనబడును. అప్పుడది బ్రహ్మమును గ్రహియింప సాధనముకాగలదు. అందువలననే బ్రహ్మవిదులు బ్రహ్మము 'బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్' 'అతీంద్రియమైనను బుద్ధి

గ్రాహ్యమే' అని యందురు. కావున ధీశాలులైన యాచార్యులు బ్రహ్మమునుగూర్చి చెప్పగలరు. వారు 'బ్రహ్మము విదితము కంటె భిన్నమే. అవిదితముకంటెను మించియే యున్నది. అని నుడివిరి.

ఇంద్రియములకు దెలియు పదార్థములన్నియు విదితము లనబడును. స్థూల ప్రపంచమంతయు నిందు జేరును. ఈ స్థూల పదార్థమయమగు జగత్తున కంతటికి కారణమగు సూక్ష్మప్రకృతి యవిదిత మనబడును. ఇట్లు కార్యకారణ రూప జగత్తుకంటెను బ్రహ్మము భిన్నమనియు, నయ్యది వానిని మించియుండుననియు నాచార్యు లుపదేశింప గురువులు విని శిష్యాదుల కట్లే చెప్పుదురని యభిప్రాయము.

బ్రహ్మనిష్ఠులయిన గురువులు తమ సంతానమునకు, శిష్యులకు బ్రహ్మమునుగూర్చి యిట్లు చెప్పుదురు- 'బ్రహ్మము ఇంద్రియములచే నెఱుగబడదు. ఇంద్రియములచే రూపాది గుణములు గల జగత్పదార్థములే తెలియనగును. బ్రహ్మము నం దట్టి రూపాదిగుణములులేవు. కావున నది సామాన్యముగ గాని, విశేషముగగాని యింద్రియములచే దెలియబడదు. కాని, మనస్సును ధ్యానాదులచే శుద్ధమొనర్చి దానితో బ్రహ్మము నెఱుగ వచ్చును. బ్రహ్మము కార్యకారణాత్మకమగు నీ స్థూలసూక్ష్మ జగత్తుకంటె భిన్నమైన తత్త్వమని గురుశిష్య పరంపరవలన దెలియుచున్నది.'

కొందఱు తా మింద్రియములతో ననుభవించు జగత్తే బ్రహ్మమని యెంచి, దాని నుపాసించుచుందురు. రాబోవు వాక్యములలో నీ జగత్తు బ్రహ్మము కాదని మహర్షి తెలుపుచున్నాడు.

యద్ వాచా నభ్యుదితం
యేన వా గభ్యుద్యతే
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే. ౪

యత్=ఏది, వాచా=వాగింద్రియముచే, అనభ్యుదితం= ప్రకటము చేయబడదో, యేన=దేనిచే, వాక్=వాగింద్రియము-వాక్కు, అభ్యుద్యతే = ప్రకటింపబడుచున్నదో, తత్ ఏవ = దానినే, త్వం=నీవు, బ్రహ్మ=బ్రహ్మమని, విద్ధి=తెలిసికొనుము, కాని, మనుజులు, యత్ ఇదం=(వాగింద్రియముచే దెలియబడు నీ శబ్దాది రూప కార్య ప్రపంచమును) దేనిని, ఉపాసతే= సేవించుచున్నారో-తెలియుచున్నారో, ఇదం న=ఇది బ్రహ్మము కాదు.

వాగింద్రియము శబ్దమును బ్రకటింప సాధనము. దానిచే శబ్దములుచ్చరింపబడును. కావున నది శబ్దమును ప్రకాశింప జేయును. కాని బ్రహ్మమునుకాదు. బ్రహ్మము శబ్దము కాదు గదా! ఇంతేకాక బ్రహ్మము వాగింద్రియమును నిర్మించి, దానిచే శబ్దము పలుకబడుటకు దగిన వ్యవస్థయు నేర్పఱచినది. అందువలననే వాక్కు శబ్దముల నుచ్చరించునే కాని యన్య కార్యముల నాచరింపజాలదు.

బ్రహ్మ నిర్మితమైన వాగింద్రియముచే బ్రకటితమగు శబ్దము అర్థమును గ్రహింపజేయ సాధన మగును. అర్థమును బ్రతిపాదించునదియే శబ్దమగునని భావము.

ధ్యానముతో బ్రహ్మము నెఱిగిన యాచార్యులు శబ్దముల ద్వారముననే తమ శిష్యులకు బ్రహ్మము నుపదేశింతురు.

అంతట నా శిష్యులును తమ బుద్ధిబలమునకు దగినట్లు గురువులు చెప్పిన శబ్దములమూలముననే బ్రహ్మమును దెలిసికొందురు. కాని, యాచార్యోపదిష్ట శబ్దములు శబ్దార్థ సంబంధమును స్మరియింపజేయుటకు గారణములగును. బ్రహ్మమును బోధించుటకు సాక్షాత్కారణము కాజాలవు. సత్యశౌచాదుల నలవఱచుకొని, యభ్యసించు నిరంతర ధ్యానమే బ్రహ్మ సాక్షాత్కారమునకు కారణము కాగలదు, అనగా, గురూపదిష్ట శబ్దములు శిష్యశ్రవణమునకు కారణములగును. శ్రవణానంతరమున మనన ధ్యానాదుః లేర్పడును. అప్పుడుకాని బ్రహ్మ సాక్షాత్కారము కలుగజాలదని భావము. అందువలన వాక్కు బ్రహ్మమును బ్రకటింపదని యుపనిషద్వాక్యాభిప్రాయము.

అనేకు లీ యాథార్థ్యమును దెలిసికొనక శబ్దమే బ్రహ్మమనియు, లోకమే బ్రహ్మమనియు నెంచి వానినే యుపాసించుచుందురు. దృశ్యమానప్రపంచము బ్రహ్మముకాదు. బ్రహ్మము ఇంద్రియములచే దెలియబడునది కాదని మహర్షి స్పష్టము చేసియున్నాడు.

యన్మనసా న మనుతే
యే నాహు ర్మనో మతమ్
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే. ౫

యత్=ఏది, మనసా=మనస్సుతో, న మనుతే=సంకల్ప వికల్పములను జేయదో, యేన = దేనిచే, మనః = ప్రాణుల యంతఃకరణము, మతం=తెలియబడుననియో, లేక వ్యాప్తమై యున్నదనియో, ఆహుః = బ్రహ్మవిదులు నుడువుదురో, తత్

ఏవ=అదియే, బ్రహ్మ=బ్రహ్మము అని, త్వం=నీవు, విద్ధి=తెలిసికొనుము, య నిదం=దేనిని, ఉపాసతే = జనులు ఉపాసించుచున్నారో, ఇదం న=ఇది బ్రహ్మము కాదు.

సంకల్పవికల్పముల నొనర్చుటకుగాని సుఖదుఃఖములను తెలిసికొనుటకుగాని సాధనముగ నుపయోగించు మనస్సనబడు నింద్రియ మొండు బ్రహ్మమునకు లేదు. అందువలన బ్రహ్మము మనస్సుతో నాలోచింపదు. సంకల్ప వికల్పములను జేయదు. నిశ్చయింపదు. అయినను సర్వజీవుల మనస్సులందు వ్యాప్తమైయుండి వాని నెఱుంగుచుండును. కావుననే బ్రహ్మము 'మనీషీ'యని ఈశావాస్యమున వర్ణింపబడినది. ఇట్లే మఱియొకయెడ బ్రహ్మము 'మనసో మనః' మనస్సునకు మనస్సు అనియు చెప్పబడినది. అనగా, బ్రహ్మము వ్యాపకము కావున జీవుల మనస్సులం దంతట తానుండి, వానికి సంకల్ప వికల్పాదుల నొనర్చుటకు వలయుశక్తి నిచ్చుచున్నదని భావము. మిగిలిన భాగము పూర్వమున వ్యాఖ్యానించినట్లు తెలియనగును.

యచ్చక్షుషా న పశ్యతి
యేన చక్షూంషి పశ్యతి
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే. ౬

యత్=ఏది, చక్షుషా = నేత్రముతో, న పశ్యతి=చూడదో, **యేన**=దేనిమూలమున, చక్షూంషి = కన్నులను ఉపయోగించి జీవుడు, పశ్యతి = చూచుచున్నాడో, తదేవ = అదియే, త్వం బ్రహ్మ విద్ధి = నీవు బ్రహ్మమని తెలిసికొనుము, నేదం-యత్ ఇదం ఉపాసతే=జను లుపాసించునది బ్రహ్మముకాదు.

బ్రహ్మమునకు మనస్సు లేనట్లే నేత్రములును లేవు. రూపవంతమగు వస్తువుల నెఱుగుటకు నేత్రములు జీవులకు సాధనములగును. బ్రహ్మనిర్మితములగు చక్షువులతో జీవులు రూపవంతమగు-నానావిధ చిత్రవిచిత్రములగు వర్ణములతో నలంకృతమై యుండు - నీ జగత్తును దర్శించుచుందురు. బ్రహ్మమున కట్టి చక్షువులులేవు. సాధనముల సాహాయ్యమపేక్షింపకయే బ్రహ్మము సర్వము నెఱుగగలదని భావము. అందువలననే 'పశ్య త్యచక్షుః' బ్రహ్మము చక్షువులు లేనిదైనను చూడగలదని వేఱొకచో వర్ణింపబడినది. కావున జనులు ఉపాసించు జగత్తుమాత్రము బ్రహ్మముకాదు.

యచ్ఛ్రోత్రేణ న శృణోతి
యేన శ్రోత్ర మిదం శ్రుతమ్
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే. ౭

యత్=ఏది, శ్రోత్రేణ = చెవితో, న శృణోతి = వినదో, యేన = దీనిచే, ఇదం శ్రోత్రం = ఈ శ్రవణేంద్రియము-చెవి, శ్రుతమ్ = శ్రుతమో-తెలియబడినదియో, తదేవ = అదియే, త్వం=నీవు, బ్రహ్మ విద్ధి=బ్రహ్మమని యెఱుంగుము............

బ్రహ్మము శరీరములేని దగుటచే నేత్రాదీంద్రియములు లేనిదగుచున్నది. కావున నది చెవితో వినదు. కాని, జీవులే శ్రవణేంద్రియముతో శబ్దములను గ్రహింతురో యా శ్రవణేంద్రియమును బ్రహ్మమే నిర్మించును. శబ్దమునుమాత్రము గ్రహింపగలశక్తియు దానికి నొసంగినదియు బ్రహ్మమే. బ్రహ్మము వ్యాపకమై శ్రవణేంద్రియమును నియమితమొనర్చుటచేతనే

అది శబ్దమును గ్రహింపగలుగుచున్నదనియు తెలియనగును. చెవికి శబ్దగ్రాహకశక్తి నొసంగునదియే బ్రహ్మము. కాని, జను లుపాసించు జగత్తు మాత్రము బ్రహ్మము కాదని గురువు శిష్యున కుపదేశించుచున్నాడు.

యత్ ప్రాణేన న ప్రాణితి
యేన ప్రాణః ప్రణీయతే
త దేవ బ్రహ్మ త్వం విద్ధి
నేదం య దిద ముపాసతే. ౮

యత్ = ఏది, ప్రాణేన = ఉచ్ఛ్వాస నిశ్వాసాత్మకమగు ప్రాణక్రియతో, న ప్రాణితి = ముక్కుపుటములతో నుచ్ఛ్వాస నిశ్వాసముల నొనర్పదో, యేన=దేనిచే, ప్రాణః = ప్రాణము, ప్రణీయతే=నిజ కర్మమున నడుపబడుచున్నదో, తదేవ బ్రహ్మ త్వం విద్ధి=అదియే బ్రహ్మమని నీ వెఱుగుము. నేదం య దిద ముపాసతే = జనులు దేని నుపాసించుచున్నారో యీ జగత్తు బ్రహ్మము కాదు.

ఈ పద్యమున బ్రహ్మమునకు నాసికేంద్రియము లేద నియు, జీవులకు ఉచ్ఛ్వాస నిశ్వాసములకు సాధనముగా నుండి వారి జీవనమున కుపయోగించు న ఎక బ్రహ్మముచేతనే నిర్మింపబడినదనియు, జీవుల నాసికాపుటములలో వ్యాపార మొనర్చు వాయువుకూడ బ్రహ్మముచే నియమితమై తన కార్య ములను సంపాదించు చున్నదనియు స్పష్టపఱపబడినది.

కేనోపనిషత్తులోని యీ ప్రథమఖండమున దృశ్యమాన ప్రపంచము బ్రహ్మము కాదనియు నందు బ్రహ్మము వ్యాపకమై

వానిని నియమిత మొనర్చుచున్నదనియు వర్ణింపబడినది. బ్రహ్మము వ్యాపకతత్త్వ మగుటచే నయ్యది శరీరబద్ధము కాదనియు బాగుగ వివరింపబడినది. జీవుడు శరీరబద్ధుడై జ్ఞానేంద్రియములతో పదార్థముల నెఱుంగును. కర్మేంద్రియములతో నీ జగత్తున వ్యవహరించును. అంతఃకరణముతో సంకల్పవికల్పముల నొనర్చుచు, ప్రవృత్తి నివృత్తులకు లోనై సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. కాని, యీ యింద్రియ సముదాయమును నిర్మించి, వానికి నియతస్వభావముల నేర్పఱచునది బ్రహ్మమేకాని జీవుడు కాదు. బ్రహ్మ మీ యింద్రియములందును, తత్సంయుక్త జగత్తునం దంతటను వ్యాపకమై యుండును. కాని యింద్రియములతో రూపాదివిషయములయం దాసక్తము కాదు. జను లీ సత్యమును గ్రహింపక దృశ్యమానవిశ్వమే బ్రహ్మమని యుపాసించుచున్నారు. ధ్యానాదులచే బ్రహ్మము నెఱిగి, బ్రహ్మనిష్ఠుడయిన గురువు శిష్యునకు జగత్తు బ్రహ్మము కాదనియు, వానిని నియమించునదియే బ్రహ్మమనియు బోధించునట్లు స్పష్టము చేయబడినది.

ప్రథమ ఖండము సమాప్తము.



# ద్వితీయ ఖండము

యది మన్యసే సువేదేతి
దభ్రమేవాపి నూనం త్వం వేత్థ
బ్రహ్మణో రూపమ్ యదస్య
యదస్య త్వం దేవేష్వథ ను
మీమాంస్యమేవ తే విదితం మన్యే. ౯-౧.

అస్య బ్రహ్మణః=పూర్వఖండమున వర్ణింపబడిన యీ బ్రహ్మము యొక్క, యద్రూపమ్=ఏ స్వరూపము కలదో, తత్ దభ్రమేవ=అది యత్యంతము సూక్ష్మమే, దానిని, త్వం=నీవు, నూనం=నిశ్చయముగా, సువేద=బాగుగ తెలిసికొంటిని, ఇతి= అని, అపియది మన్యసే=తలంచుదు వేని, దేవేషు=విద్వాంసులలో, అస్యయద్ (రూపం)=ఈ బ్రహ్మము యొక్క యే రూపము, విదితం=తెలియబడి యన్నదో, అది నీవు, వేత్థ= తెలిసికొంటి వని, నేను తలంపను, కారణ మేమన, తే=నీకు, అథను=అనంతరము కూడ, ఆ బ్రహ్మరూపము, మీమాంస్య మేవ = మీమాంసింపదగినదియే - తెలిసికొనదగినదియేయని, మన్యే=నేను తలంచుచున్నాను.

రెండవ యర్థము :

శిష్య ! అస్య బ్రహ్మణః యద్ రూపం (తత్)
త్వం సువేదేతి యది మన్యసే
నూనం దభ్రమేవ వేత్థ. అథను దేవేషు
అస్య యద్ (రూపం) విదితం తదపి త్వం మన్యసే
సువేదేతి తే మీమాంస్యమేవ మన్యే.

అస్య బ్రహ్మణః = ప్రథమ ఖండమున వర్ణింపబడిన బ్రహ్మముయొక్క, యద్రూపం=యే స్వరూపము కలదో, తత్=అది, త్వం=నీవు, సువేద ఇతి=బాగుగ తెలిసికొనుచున్నానని, యది మన్యసే=తలంచుదువేని, నూనం=నిశ్చయముగ, దభ్రమేవవేత్థ = అల్పముగానే తెలిసికొనుచున్నావు. అథను=అనంతరము, దేవేషు = విద్వాంసులలో, అస్యయత్ రూపం=ఈ బ్రహ్మముయొక్క యే రూపము, విదితం=తెలియుబడియున్నదో, తదపి త్వం వేత్థ ఇతి యది మన్యసే=అదియు నీకు తెలియునని యెంచెదవేని, తే=నీకు,మీమాంస్యమ్ ఏవ= విచారింప దగినదియే - ఆలోచింపదగినదియే యని, మన్యే= నేను తలంచుచున్నాను.

ఓ శిష్య!బ్రహ్మముయొక్క స్వరూప మత్యంత సూక్ష్మము. దానిని నీవు బాగుగ తెలిసికొంటినని యెంచెదవేని, విద్వాంసు తెలిసిన బ్రహ్మస్వరూపమును నీ వెఱిగితివని నే నెంచను. అయ్యది నీ కింకను తెలిసికొనదగినదియే యై యున్నది.

ఈ యుపనిషత్తునందు గురుశిష్య సంవాదరూపమున బ్రహ్మమును గూర్చి చెప్పబడినది, మొదటి ఖండమున నింద్రియాదు లెట్లు ప్రవర్తించుచున్నవని జిజ్ఞాసువు-శిష్యుడు ప్రశ్నింపగా వానిని నిర్మించి, నియత విషయములందు బ్రవర్తించు స్వభావముగలవానిగ చేసినది బ్రహ్మమనియు, జీవుడు కాదనియు, బ్రహ్మమున కా యింద్రియము లుండవనియు, దృశ్యమాన ప్రపంచము బ్రహ్మము కాదనియు గురువుసామాన్యముగ బోధించి యున్నాడు.

ఇప్పు డీ ఖండమున నా బ్రహ్మముయొక్క స్వరూపమత్యంత సూక్ష్మమని గురువు శిష్యునకు తెలుపుచున్నాడు.

ఇందు ప్రయోగింపబడిన 'రూప' శబ్దము ఆకారమునుగాని, వర్ణమునుగాని బోధింపదు. జనులు సామాన్యముగ రూపశబ్దమున కర్థము వర్ణమనియో, ఆకృతియనియో చెప్పుచుందురు. బ్రహ్మము సూక్ష్మతత్త్వము కావున నందు వర్ణముకాని, ఆకృతిగాని రెండును లేవు. కాగా నిట రూపశబ్దము స్వరూపవాచకమని యెంచవలయును. స్వరూప-రూపశబ్దములు శాస్త్రమున లక్షణవాచకములుగ తెలియబడును. లక్షణ మన విశేష ధర్మమనియు జెప్పవచ్చును. ఏ విశేష ధర్మము మూలమున నొక వస్తువు గుర్తింపబడునో యదియే దానికి రూపము, స్వరూపము, లక్షణము ననబడును. కావున బ్రహ్మరూప మనగా బ్రహ్మము యొక్క లక్షణమని యర్థము. ఏ లక్షణము - ధర్మముచే బ్రహ్మము దెలియనగునో యదియే బ్రహ్మమునకు రూపము. అయ్యది విద్వాంసులకు-వేదాది సత్యశాస్త్రముల నభ్యసించిన మహానుభావులకు తెలియును? జిజ్ఞాసువుల కది యాలోచించి తెలిసికొనదగినదై యున్నది. ఉపనిషత్కర్త మహర్షి యీ యభిప్రాయమునే పై పంక్తులలో స్పష్టము చేసియున్నాడు.

వాస్తవమున ప్రథమ ఖండమునందు జగత్తు బ్రహ్మము కాదని చెప్పబడినది. మఱియు జీవుల జ్ఞానాదులకు ఉపకరణములయిన యింద్రియములకు రూపాదులను గ్రహించుశక్తి బ్రహ్మమువలననే లభించినదని వర్ణింపబడినది. అంతమాత్రమున చేతనే యెవడేని తనకు బ్రహ్మస్వరూపము బాగుగ తెలిసినట్లు దలంచిన నది సరికాదు. అతడు బ్రహ్మస్వరూపము నతిస్వల్పముగానే యెఱిగినవాడగును. దేవతలు-విద్వాంసులు విద్యాబలముతో ధ్యానాదులందు నిష్ఠగలవారై బ్రహ్మస్వరూపము నెఱుగుదురు. విద్వాంసులకు విదితమగు నా స్వరూపము జిజ్ఞాసువులకు తర్కాదులతో మీమాంసించిన మీదటనే స్పష్టము కాగలదని అభిప్రాయము.

నాహం మన్యే సువేదేతి
నో న వేదేతి వేద చ
యో న స్తద్వేద తద్వేద
నో న వేదేతి వేద. ౧౦-౨

అహం=నేను, సువేద ఇతి=బాగుగ బ్రహ్మము నెఱుగుదును అని, న మన్యే=తలంపను, న వేద ఇతి నో=ఎఱుగను అనియు తలంపను, వేద చ=ఎఱుగుదును కూడ, నః=మనలో, యః=ఎవడు, తద్ వేద=అది యెఱుగునో, తద్ వేద-ఆ బ్రహ్మము నెఱుగుచున్నాడు, నవేద ఇతి న=ఎఱుగనని నేను తలంపను, వేద చ=ఎఱుగుదును కూడ.

గురువు శిష్యులకు జ్ఞానియైన వ్యక్తి యెట్లు వచింపవలయునో యిందు బోధించుచున్నాడు.

లోకమున నెవడైనను 'బ్రహ్మమును బాగుగ నెఱుగుదును' అని యెంచుట గర్వకారణమగును. కావున బ్రహ్మజ్ఞాని యగు వ్యక్తి తాను బ్రహ్మమును బాగుగ నెఱుగుదునని యెంచడు; చెప్పడుకూడ. అంతమాత్రమున నతడు బ్రహ్మము నెఱుగడని యెంచరాదు. కారణ మేమన నతడు బ్రహ్మము నెఱుగును. ఈ రహస్యము నెఱిగిన వ్యక్తియే వాస్తవమున బ్రహ్మము నెఱిగినవాడు.

బ్రహ్మము నెఱిగిన బ్రహ్మవేత్త తాను బ్రహ్మమును బాగుగ నెఱిగినట్లు తలంచిన దోషమేమి? అందులేని, అది గర్వమునకు హేతువగునని యింతకు పూర్వమే చెప్పియుంటిని. జ్ఞాని గర్వితుడు కాడు. మఱియు బ్రహ్మమును బాగుగ

నెఱిగినవ్యక్తి యూ బ్రహ్మమును బాగుగ నితరులకు జెప్పవల సినవా డగును. వాగాదీంద్రియములచే నయ్యది వ్యక్తపఱప బడజాలదని 'యద్ వాచా అనభ్యుదితం, యేన వాగభ్యుద్యతే' అను నిట్టి వాక్యములచే పూర్వమే చెప్పబడినది. బ్రహ్మము శుద్ధాంతఃకరణము ద్వారమున ననుభవమునకు దెచ్చుకొన దగినదియే కాని, వాగాదులచే స్పష్టపఱచుట దుర్ఘటము కావున బ్రహ్మవిదులు గర్వమునకు తా వొసంగరు. వారు బ్రహ్మము నెఱుగుదురు. కావున నెఱుగ మనియు జెప్పరు. ఈ రహ స్యము నెఱిగినవాడే బ్రహ్మవిదుడు.

యస్యామతం తస్య మతం
మతం యస్య న వేద సః
అవిజ్ఞాతం విజానతాం
విజ్ఞాత మవిజానతామ్. ౧౧-3

యస్య=ఎవనికి, అమతం=బ్రహ్మము మనస్సుతో దెలి యబడ దగినది కాదో, తస్య=ఆతనికి, మతం = బ్రహ్మము తెలియబడినది-జ్ఞాతము-అని యెంచవలయును, యస్య = ఎవనికి, మతం=మనస్సుతో బ్రహ్మము తెలియబడదగినదో, సః=అతడు, న వేద=బ్రహ్మము నెఱుగడు, విజాన తాం=మన స్సుతో మేము బ్రహ్మము నెఱుగుదు మని యెంచువారికి, అవిజ్ఞాతం = అది తెలియునిదే, అవిజానతామ్=బ్రహ్మము మన స్సునకు విషయము కాదు అని యెంచువారికి, విజ్ఞాతం = బ్రహ్మము తెలియబడినదిగా నెంచవలయును.

పూర్వము చెప్పిన విషయమే మరల సంక్షేపముగ శబ్దాం తరములతో వెల్లడింపబడినది.

బ్రహ్మము చక్షురాదీంద్రియములచే నెఱుగబడదు. కావుననే మనస్సు కూడ దాని నెఱుగ సాధనముకాదు. సాధారణమానవుని మనస్సు, నేత్రాదులతో తెలిసికొనిన పదార్థములనే విశేషముగ నెఱుగును. అందువలననే "యథా చక్షుషా పశ్యతి, తథా మనసా విజానాతి" "నేత్రముతో నెట్లు చూచునో మనస్సుతో నట్లే విశేషముగ నెఱుగును' అని వాత్స్యాయనుడు నుడివియున్నాడు. రూపాదులు బ్రహ్మమునకు లేనందున చక్షువుల కది యందదు. కావుననే మనస్సునకు నది విషయముకాదు. ఈ కారణముచేత మనస్సుతో బ్రహ్మము తెలియబడునని యెంచువాడు బ్రహ్మము నెఱుగజాలడు. ఎవడు 'బ్రహ్మము మనస్సునకు విషయముకాదు. అది ధ్యానాదుల మూలమున బుద్ధికి మాత్రము గ్రాహ్యమగును' అని యెంచునో వానికే బ్రహ్మము తెలియబడునని భావింపవలయును.

ప్రతిబోధ విదితం మత
మమృతత్వం హి విందతే
ఆత్మనా విందతే వీర్యం
విద్యయా విందతేఽమృతమ్. ౧-౨-౪

ప్రతిబోధ విదితం=ప్రతిబోధ మూలమున తెలియబడిన బ్రహ్మము, మతం=తెలియబడినదిగా నెంచవలయును. అట్టి జ్ఞానముతో జీవుడు, హి=నిశ్చయముగ, అమృతత్వం = మోక్షమును, విందతే=పొందును, ఆత్మనా = తనచే-స్వరూప జ్ఞానముతో, వీర్యం=బలము-యోగబలము, విందతే=పొందును, విద్యయా=బ్రహ్మజ్ఞానముచే, అమృతమ్=మరణ రహితమగు పరమతత్త్వమును, విందతే=పొందును.

చిత్తము ఇంద్రియముల ద్వారమున వస్తువులను బొంది, వాని యాకృతులను ధరించును. అదియే చిత్తవృత్తి యనియు, బోధ యనియు ననబడును. విషయజ్ఞానము బోధ యనబడు నని భావము.

ఇంద్రియములను విషయములవంక బోనియక, చిత్తము నేకాగ్రమొనర్చి, సమాహిత మొనర్చుటవలన చిత్తము సంస్కారశూన్యమై శుద్ధమగును. అటుపై జీవునకు తన స్వరూప జ్ఞానము కలుగును. ఇయ్యదియే ప్రతిబోధ యనబడును. ఇట్టి ప్రతిబోధమూలముననే బ్రహ్మము విదితమగును-తెలియనగును. అందువలన జీవుడు జన్మమరణరూప దుఃఖముల నుండి విముక్తుడై మోక్షసుఖము ననుభవించును. ఇందులకు వీర్యము-యోగబలమావశ్యకము. లోకమునగల విషయములం దాసక్తుడై యుండువాడు వీర్యమును బొందజాలడు. విషయ భోగములవలన వీర్యము క్షయమగును. కావున విషయాసక్తిని విడిచి, జితేంద్రియుడై, యాత్మజ్ఞానము కొఱకు యత్నించు వాడు వీర్యవంతు డగును. యమ నియమపాలన మొనర్చి, చిత్తైకాగ్రతకు నిరంతరము సాధన మొనర్చుచు, నాత్మసాక్షాత్కారము కొఱకు యత్నించుటవలన యోగబలము ప్రాప్తించును. తన్మూలమున బ్రహ్మసాక్షాత్కారము కలుగును. బ్రహ్మజ్ఞానమే విద్య యనబడును. అదియే మోక్షసాధనము.

ఇహ చే దవేదీ దథ సత్య మస్తి
న చే దవే దీన్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచింత్య ధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి. ౧౩,౫

ఇహ=ఈ జన్మమున, అవేదీత్ చేత్=ఆత్మ నెఱిగినట్లయిన, అథ సత్యమ్ అస్తి=జన్మము సఫలమైనదని యెంచవలయును, న అవేదీత్ చేత్=తెలిసికొనకపోయినచో, మహతీ వినష్టిః=గొప్పనష్టము కలుగును. ధీరాః = ధ్యానశీలురగు విద్వాంసులు, భూతేషు భూతేషు=చరాచరాత్మకములగు సర్వపదార్థములందును, విచింత్య = విశేషముగ ఆత్మను నిశ్చయించి, అస్మాత్ లోకాత్—ఈ సంసారమునుండి, ప్రేత్య=శరీరాదులను విడిచి, అమృతాః భవంతి=ముక్తులగుదురు.

మానవ జన్మము తక్కిన జన్మములకంటె నుత్తమము. ఈ జన్మమునందే జీవుడు తనను తాను తెలిసికొన గలుగును. కావున నట్లు తెలిసికొన యత్నించినవాని జన్మము సఫలమగును. అట్లు చేయక ఇంద్రియములతో విషయములందు చిక్కుపడి, శుభాశుభములను వివేచింపక, లోకమున వర్తించి చనిపోవువాడు గొప్పహానికి లోనగును. తా నొనర్చిన కర్మముల ఫలముల ననుభవించుటకు వివిధ జన్మములను బొంది, పలుమాఱు మరణయాతనల ననుభవింపవలసినవా డగును. ఇంతకంటె మించిన హాని మఱియొకటి యేమి గలదు! అందువలననే విద్వాంసులు ధ్యానాదుల నొనర్చి, విషయజాలమున చిక్కుపడక సర్వప్రాణులందును, సర్వపదార్థములందును వ్యాపకమైయుండు పరమ సూక్ష్మతత్త్వమగు పరమాత్మను దెలిసికొని అమరులగుదురు. జన్మ మరణరూప దుఃఖపరంపరనుండి తొలగి బ్రహ్మానందము ననుభవింతురు.

ద్వితీయ ఖండము సమాప్తము.



# తృతీయ ఖండము

ప్రథమ ఖండమున నింద్రియాదులకు నియతశక్తులను గల్పించి, వానియందు వ్యాపకమై యుండి, వానిచే బద్ధము కాకుండునది బ్రహ్మమని సామాన్యముగ బ్రహ్మము నిర్దేశింప బడినది.

రెండవ ఖండమున నా బ్రహ్మము సుగమముగా తెలియ బడునది కాదనియు ధ్యానశీలురై బ్రహ్మము నెఱిగినవారును వాగాదీంద్రియములతో బ్రహ్మము నెఱింగించుట కలవిగాదని చెప్పుదురనియు వివరింపబడినది.

ఈ మూడవ ఖండమున నాఖ్యాయిక నొక దానినికల్పించి, తన్మూలమున బ్రహ్మముయొక్క మహత్త్వము విశదీకరింపబడు చున్నది. ఈఖండమున శబ్దార్థములకంటె వాక్యార్థతాత్పర్యమునే ముఖ్యముగ గ్రహింపవలయును.

బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే
తస్య హ బ్రహ్మణో విజయే
దేవా అమహీయంత
త ఐక్షంత అస్మాక మేవాయం
విజయో ఽస్మాక మేవాయం మహి మేతి. ౧౪.౧

బ్రహ్మ=బ్రహ్మము-పరమేశ్వరుడు, దేవేభ్యః=అగ్ని, వాయువు మున్నగు దేవతలకొఱకు, హ=నిశ్చయముగ, విజిగ్యే=విజయమును బొందెను, తస్య హ బ్రహ్మణః=ఆ బ్రహ్మముయొక్క, విజయే=విజయమునందు, దేవాః=అగ్న్యాది దేవతలు, అమ

హీయంత=మహిమగలవి యయ్యెను, తే=ఆదేవతలు, అయం విజయః= ఈవిజయము, అస్మాకమేవ=మనదే, అయం మహిమా = ఈ మహిమ, అస్మాకమేవ=మనదే, ఇతి = అని, ఐక్షంత = చూచెను-తలచెను.

బ్రహ్మము (పరమేశ్వరుడు) ప్రపంచమునగల అగ్ని, వాయువు మున్నగు సమస్త దేవతల కంటె పెద్దది. బ్రహ్మమునకు మించిన పదార్థ మింకొకటి లేదు. బ్రహ్మశబ్దమునకు గొప్పది యనియే యర్థము. ఆ బ్రహ్మము సమస్త శక్తులకు నిలయము. దాని మూలముననే యితర పదార్థములు శక్తిమంతములగును. అగ్ని, వాయువు మున్నగు భౌతిక పదార్థములు దేవతలని వ్యవహరింపబడును. దివ్యగుణములు గలవి కావున, వానికి దేవత యను నామము సార్థకమగుచున్నది. అగ్ని వాయ్వాది దేవతలు లోకమున మహిమ గలవిగా నెంచబడుచున్నవిగదా! కాని వానికా మహిమ పరమేశ్వరునివలన లభించినదియే. అగ్న్యాది దేవతలా విషయమును విస్మరించి యా మహిమ, విజయము తమదిగానే యెంచినట్లు ఆలంకారికముగా వర్ణింపబడినది.

తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యో హ ప్రాదుర్బభూవ
తన్న వ్యజానంత, కి మిదం యక్ష మితి. ౧౫.౨

తత్ = ఆ బ్రహ్మము, ఏషాం = ఈ యగ్న్యాది దేవతల యొక్క (భావమును), విజజ్ఞౌ=తెలిసికొనెను, హ=నిశ్చయముగ, తేభ్యః=వారికి, ఆ బ్రహ్మము, ప్రాదుర్బభూవ=ప్రకటమయ్యెను, తత్=ఆ బ్రహ్మమును, న వ్యజానంత=ఆ దేవతలు తెలిసికొనజాలకపోయెను. ఇదం యక్షం కిమితి=ఈ యక్షమేమి యని గుర్తింపజాలకపోయెను.

అగ్న్యాది దేవతల భావమును గుర్తించి బ్రహ్మము వారి యెదుట యక్షరూపమున బ్రత్యక్షమయ్యెను. అప్పుడా దేవతలా యక్షుని జూచి గుర్తింపజాలక యా యక్షు డెవడు అని యాశ్చర్యపడసాగిరి.

మనుజు లజ్ఞానముచే అగ్ని, వాయువు మున్నగు పథార్థములలో గల శక్తి సామర్థ్యములకు కారణమైన బ్రహ్మమును దెలిసికొనక, అగ్న్యాదులనే పూజింపసాగిరి. అగ్న్యాది దేవతలును తమయందుగల మహిమకు కారణమును గుర్తింపక గర్వింపసాగినవి. వాని గర్వము నడంచి, జనులకు యథార్థ జ్ఞానము కలిగింప బ్రహ్మము యక్షరూపమున ప్రత్యక్షమైనదని భావము.

తేఽగ్ని మబ్రువన్
జాతవేద! ఏత ద్విజానీహి
కి మేతద్ యక్ష మితి, తథేతి. ౧౬.3

తే=ఆ దేవతలు, అగ్నిం అబ్రువన్=అగ్నితోననిరి, జాతవేద!=ఓ యగ్నీ!, ఏతత్ కిమ్ యక్షమ్=ఈ యక్షుడెవడు?, విజానీహి=తెలిసికొనుము, ఇతి=ఇట్లనగా, తథేతి=అట్లేయని అగ్నిదేవత యంగీకరించెను.

అగ్ని, వాయువు, ఇంద్రుడు నను దేవతలు తమ యెదుట ప్రత్యక్షమైన యక్షుని జూచి యాశ్చర్యపడి, అతనిని తెలిసికొనకోరి, అగ్నిదేవత నందులకై ముందుగా నియమించిరి. అగ్నియు యక్షుని తెలిసికొన నంగీకరించెను.

త దభ్యద్రవత్త మభ్యవదత్
కోఽసీతి అగ్ని ర్వా అహ మస్మీ
త్యబ్రవీ జ్జాతవేదో వా అహ మస్మీతి. ౧౭.౪

అపు డా యగ్ని, తత్ = యక్ష రూపమున గనబడిన బ్రహ్మమునకు, అభ్యద్రవత్ = ఎదురుగా వెళ్ళెను, అంతట నా యక్షుడు, తమ్=అయగ్నిని, కోఽసీతి=నీ వెవడవు అని, అభ్య వదత్=అడిగెను, అందుల కా యగ్ని, అహం=నేను, అగ్నిః అస్మి=అగ్నిదేవుడను, వా=లేక, జాతవేదః అస్మి=జాతవేదు డను, ఇతి=అని, అబ్రవీత్=పలికెను.

తమ యెదుట నావిర్భవించిన యక్షు డెవరో తెలిసికొన వలయునని యుద్దేశించి యగ్నిదేవు డతనిని సమీపించెను. అంతట నా యక్షుడు 'నీ వెవరవు ?' అని యగ్ని నడుగగా నందులకు 'నేను అగ్నిని, జాతవేదుడను' అని అగ్ని సమాధా నము చెప్పెను.

'జాయతే వేదో ధనం వా యస్మాత్ స జాతవేదః' 'ఎవనినుండి వేదము కాని, ధనము కాని పుట్టునో వాడు జాత వేదుడు' అనబడును. ఈ నామము పరమేశ్వరునకు, అగ్నికి వర్తించును. పరమేశ్వరునుండి వేదములుద్భవించినవి. అందువలన పరమేశ్వరుడు జాతవేదు డనబడును. లోకమున గల ధనాదులకును నతడే కారకుడు. అగ్ని శిల్పవిద్యలలో నెక్కుడుగా నుపయోగించు వస్తువు. తన్మూలమున లోకమున ధనము సంపాదింపనగును. అందువలన నగ్నియు జాతవేదు డనబడును.

తస్మిం స్త్వయి కిం వీర్య
మి త్యపీదం సర్వం దహేయమ్
య దిదం పృథివ్యా మితి. ౧౮.౫

అప్పు డా యక్షుడు, తస్మిన్ త్వయి = అగ్ని నామము గల నీ యందు, కిం వీర్యం = ఏమి బలమున్నది ?, ఇతి=అని యడిగెను. అందులకు అగ్ని, పృథివ్యాం = భూమి యందలి, యత్ ఇదం=ఏ కొంచెముకలదో, ఇదం సర్వం= ఇది యంతయు, దహేయం=దహింపగలను. ఇతి=అని సమా ధానము చెప్పెను.

యక్షుడు "అగ్నిని; జాతవేదుడను అని చెప్పుకొను నీ యందుగల బల మేమి?" అని ప్రశ్నించెను.అంతట నాయగ్ని భూమియుందుండు సమస్తమును దహింపగలుగుదునని సమా ధానము చెప్పెను.

తస్మై తృణం నిదధా వేత ద్దహేతి
త దుపప్రేయాయ సర్వజవేన
త న్న శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే
నై త దశకం విజ్ఞాతుం య దేత ద్యక్ష మితి. ౧౮.౬

తస్మై=ఆ అగ్ని కెదురుగా, తృణం=తృణమును, ఏతత్ దహ ఇతి=ఇది దహింపుము అని, నిదధౌ=ఉంచెను, అంతట నా యగ్ని, సర్వ జవేన=తనకు గల సమస్త వేగముతో, తత్= ఆ తృణమును, ఉపప్రేయాయ=సమీపించి, తత్=ఆ తృణ మును,గడ్డిపోచను, దగ్ధుం=తగల బెట్టుటకు, న శశాక=సమ

ష్టుడు కాకపోయెను. సః=ఆ యగ్ని, తతః ఏవ=అటనుండియే, నివవృతే = వెనుకకు వెళ్ళిపోయెను, పోయి, యత్ ఏతత్ యక్షం=ఈ కనబడు. యక్షుడు పూజ్యవస్తువు, కిమితి=ఏమో, న ఏతత్ విజ్ఞాతుం అశకం=దీనిని తెలిసికొనజాలకపోయితిని అని వాయ్వాదులకు చెప్పెను.

అగ్ని సమస్తమును దహింపగలనని చెప్పినమీదట నా యక్షుడొక తృణము నగ్నియెదుట నుంచి, 'దీనిని దహింపు' మనెను. అగ్నియు తనకుగల శక్తి నంతటిని నుపయోగించియు నా తృణమును దహింప జాలక యటనుండియే వెనుకకు మరలివెళ్ళెను. అటతనకొఱకు ప్రతీక్షించుచున్న వాయువునకు, నింద్రునకు తా నా యక్షుని గూర్చి యేమియు తెలిసికొనజాలక పోయితి నని నుడివెను.

అథ వాయు మబ్రువన్
వాయ వేత ద్విజానీహి
కి మేత ద్యక్ష మితి.

అథ=తరువాత, అగ్ని మున్నగు దేవతలు, వాయుమ్= వాయువును, వాయో! = ఓ వాయుదేవతా!, ఏతత్ యక్షమ్ కిమ్=ఈ యక్షుడెవడో, విజానీహి=తెలిసికొనుము, ఇతి అబ్రువన్=అని యనిరి.

అగ్ని యక్షుని తెలిసికొనజాలనందున, వాయుదేవుని సంబోధించి నీవైనను తెలిసికొని రమ్ము అని యతని నియోగించిరి.

త దభ్యద్రవ_త్త మభ్యవదత్
కోఽసీతి వాయుర్వాహా మస్మీ
త్యబ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి. ౨౧-౮

అంతట వాయువు, తత్=ఆ యక్షునికి, అభ్యద్రవత్= ఎదురుగా వెళ్ళెను. తమ్=ఆ వాయువును గూర్చి, కోఽసీతి= ఎవడవు నీవు అని, అభ్యవదత్=యక్షుడు పలికెను, అహం= నేను, వాయుః అస్మి ఇతి=వాయుదేవతను, అహం=నేను, మాతరిశ్వా అస్మి=అంతరిక్షమున సంచరించువాడను, ఇతి= అని, అబ్రవీత్=పలికెను.

అగ్ని యక్షు నెఱుగజాలక తిరిగివచ్చిన తదుపరి వాయువు యక్షుని దెలిసికొనుటకై యతనిని సమీపించెను. అంతట నా యక్షుడు 'నీ వెవరవు?' అని ప్రశ్నించెను. అందులకు వాయువు 'నేను వాయుదేవతను. అంతరిక్షమున నిరాఘాటముగ సంచరింతును. అందువలన నేను మాతరిశ్వుడ ననబడుదును' అని ప్రత్యు_త్తర మొసంగెను.

తస్మిం _స్త్వయి కిం వీర్య
మిత్యపీదం సర్వ మాదదీయం
య దిదం పృథివ్యా మితి. ౨౨.౯

తస్మిన్, త్వయి=అట్టి నీ యందు, అపి కిం వీర్యమ్' ఇతి=ఏమి శ_క్తి యని, యక్షుడు వాయువును ప్రశ్నించెను. యత్ ఇదం పృథివ్యాం=భూమియం దే కొంచెమున్నదో, ఇదం సర్వం=అదియంతయు, ఆదదీయం ఇతి=ఎత్తుకొనిపోగలను, అని వాయువు బదులు చెప్పెను.

తన సమీపమునకు వచ్చిన వాయువును 'నీ యందుగల సామర్థ్య మేమి?' యని యక్షుడు ప్రశ్నించెను. అందుల కా వాయువు 'భూమియందుండు నే వస్తువునైనను ఎటకేని యెత్తు కొని పోగల'నని సమాధానము చెప్పెను.

తస్మై తృణం నిదధా వేతదాదత్స్వేతి
త దుపప్రేయాయ సర్వజవేన
త న్న శశా కాదాతుం, స తత ఏవ
నివవృతే, నై తదశకం విజ్ఞాతుం యదేత ద్యక్షమితి.
౨౩.౧౦

ఏతత్ = ఇది, ఆదత్స్వ = గ్రహింపుము-ఎత్తి పట్టు కొనుము, ఇతి=అని, తస్మై=ఆ వాయువునకెదుట, తృణం= గడ్డిపఱకను, నిదధౌ=ఉంచెను. అంతట వాయువు, సర్వ జవేన-సమస్త వేగముతో, తత్ ఉపప్రేయాయ=ఆ తృణ మును సమీపించి, తత్ ఆదాతుం=దాని నెత్తుటకు, న శశాక= సమర్థము కాకపోయెను, సః=ఆ వాయువు, తతః ఏవ=అట నుండియే, నివవృతే=మరలివెళ్ళెను, యత్ ఏతత్, యక్షం= ఈ యక్షుడెవడో, విజ్ఞాతుం=తెలిసికొనుటకు, న అశకం ఇతి= సమర్థుడను కాకపోయితి ననెను.

యక్షుడు వాయువుముందు నొక తృణము నుంచి దాని నెత్తిపట్టుకొనుమని యాదేశించెను. కాని, వాయువు కూడ నగ్నివలెనే తన జవసత్త్వముల నన్నింటి నుపయోగించియు తృణమును కదలింపజాలక వెనుకకు వచ్చి యగ్న్యాది దేవ తలకు తన యసమర్థతను వెల్లడించెను. ఇట్లు అగ్ని వాయు

దేవతలు యక్షుని గుర్తింపజాలకపోయిరి. ఇక నింద్రుడు మిగిలియున్నాడు.

అథేంద్ర మబ్రువన్ మఘవన్!
ఏత ద్విజానీహి కిమేత ద్యక్ష మితి
తథేతి తదభ్యద్రవ త్తస్మా త్తిరోదధే. ౨౪-౧౧

అథ=తరువాత, అగ్ని, వాయువులు, మఘవన్!=ఐశ్వర్యశాలివగు నో యింద్ర!, ఏతద్ యక్షం కిమ్ = ఈ యక్షుడెవడు?, ఏతత్ విజానీహి ఇతి=ఇది తెలిసికొనుము అని, ఇంద్రం = ఇంద్రుని, అబ్రువన్ = పలికిరి, తథా ఇతి= అట్లేయని, తత్ = ఆ యక్షుని, అభ్యద్రవత్=సమీపించెను, కాని, తస్మాత్ = ఆ యింద్రుడు సమీపించుటవలన, తిరోదధే=అంతర్హితమయ్యెను-యక్షుడు కనిపింపడయ్యె.

అగ్ని, వాయువు యక్షుని తెలిసికొనజాలక తుదకు ఇంద్రు నా యక్షు నెఱుంగగోరిరి. ఇంద్రుడును యక్షుని సమీపించెను, కాని, యక్షు డతనికి కనిపింపడయ్యె.

స తస్మిన్నే వాకాశే స్త్రియ మాజగామ
బహుశోభమానా ముమాం హైమవతీం
తాం హోవాచ కిమేత ద్యక్షమితి. ౨౫-౧౨

సః = ఆ యింద్రుడు, తస్మిన్ ఏవ ఆకాశే = యక్షుడావిర్భవించి యంతర్హితమైన తావుననే, హైమవతీం = సువర్ణయుక్తమైన, బహుశోభమానాం = మిక్కిలి కాంతితో ప్రకాశించు, ఉమాం, స్త్రియం=ఉమ యనెడి స్త్రీని, ఆ జగామ=

ప్రాప్తించెను-చూచెను, ఏతత్, యక్షం, కిమ్ ఇతి=ఈ యక్షు డెవడు ? అని, తాం హ ఉవాచ=ఆమె నడిగెను.

ఇంద్రుడు యక్షుని గనుగొనబోగా నతడట కనిపింప డయ్యెను. ఆ యక్షస్థానమున నొక స్త్రీ మిక్కిలిగా శోభించుచు నింద్రునకు గనిపించెను. ఇంద్రు డామెను యక్షుని గుఱించి ప్రశ్నించెను.

ఈ ఖండమున దేవతలు తామే శక్తిగలవి, విజయవంత ములు నని యెంచినట్లును, వానిలో గల శక్తి వాస్తవమున వానిది కాదని తెలుపుటకై బ్రహ్మము వానియెదుట యక్షరూప మున ప్రత్యక్షమైనట్లును, దేవత లా యక్షునియెదుట తమశక్తిని ప్రదర్శింపజాలకపోయినట్లును పాఠకు లింత వఱకును జదివి యున్నారు. ఇక్కడ ప్రదర్శింపబడిన దేవతలు ముగ్గురు- అగ్ని, వాయువు, ఇంద్రుడు. ఈ దేవతలలో అగ్ని, వాయువు నను రెండును జడ దేవతలు. ఇంద్రుడు చేతన దేవత—జీవుడు. ఇంద్రియములు గలవాడగుటచే జీవు డింద్రు డనబడును. అగ్ని, వాయువు నను రెండును జడములయినను, దివ్యగుణ ములు గలవి యగుటచే దేవత లనబడును.

అగ్ని, వాయువు మున్నగు జడపదార్థములలో గూడ మన మనేక శక్తులను జూచుచున్నాము. ఆ శక్తులన్నియు పరమే శ్వరుని సృష్టిలో వానికి లభించినవియే. పరమేశ్వరుని సామ ర్థ్యము ముందు వీని సామర్థ్య మతి స్వల్పము. ఈ విషయ మును బోధించుటకే యీ కథ యిట్లు కల్పింపబడినది.

ఇక చేతనమగు జీవుడు యక్షుని దెలిసికొనబోయినపుడు యక్షుడతనికి గనిపింపలేదనియు, నతని స్థానమున నొక స్త్రీ

కనిపించినదనియు వర్ణింపబడినది. దీని యభిప్రాయమేమో తెలిసికొనవలసియున్నది. జీవుడు తనకుగల యింద్రియములతో బ్రహ్మమును దెలిసికొన యత్నించిన నయ్యది కనిపింపదు. బ్రహ్మ మింద్రియ గోచరమగునది కాదు. ఇంద్రియములు స్థూలములగు ప్రాకృతిక పదార్థములను తెలిసికొనుటకే సాధనములగును. రూప రసాది గుణములు లేని చేతన బ్రహ్మము వానికి విషయము కాదు. అందువలననే యింద్రుడు కనుగొనబోగా యక్షు డంతర్హితు డయ్యెనని వర్ణింపబడినది.

జీవుడు బ్రహ్మము నెఱుగవలయుననిన ఇంద్రియములను విషయముల నుండి మరలించి, చిత్తశుద్ధికై యత్నింపవలయును. బ్రహ్మము బుద్ధికి గమ్యమగును. బుద్ధియు నిర్మలము కావలయును. అట్టి బుద్ధితో బ్రహ్మము సాక్షాత్కారము కావలసియున్నది. ఈ విషయమును సూచించుటకే యిట నింద్రునకు ఉమానామక స్త్రీ యొకటి ప్రత్యక్షమైనదని చెప్పబడినది. బ్రహ్మ విద్య యుపనిషత్తులలో నన్యత్ర 'ఉమ' అని చెప్పబడినది. శుద్ధ బుద్ధి యిట గ్రాహ్యము. జీవుడు ప్రయత్నించి, యమ నియమాదుల మూలమున శుద్ధబుద్ధిని సంపాదించును. అట్టి శుద్ధబుద్ధియే బ్రహ్మ సాక్షాత్కారమునకు తోడ్పడును. కావుననే యిట నింద్రుడు తనకు కనబడిన స్త్రీని 'యక్షు డెవడు?' అని ప్రశ్నించినట్లు చెప్పబడినది. ఈ ఉమ – బుద్ధి చెప్పు సమాధానము ముందురాబోవు ఖండమున జూడనగును.

తృతీయ ఖండము సమాప్తము.



# చతుర్థ ఖండము

సా బ్రహ్మేతి హోవాచ
బ్రహ్మణో వా ఏతద్విజయే
మహీయధ్వ మితి తతో
హైవ విదాంచకార బ్రహ్మేతి. ౨౬-౧

సా=ఉమ యనెడి యా స్త్రీ, బ్రహ్మ ఇతి హ = (మీ యెదుట నింతకు పూర్వ మావిర్భవించిన యక్షుడు) బ్రహ్మమని, ఉవాచ=పలికెను, వై=నిశ్చయముగా, మీరు, బ్రహ్మణః ఏతత్ విజయే=బ్రహ్మముయొక్క విజయమునందే, మహీయధ్వమ్= మహిమను బొందుడు, ఇతి=అనియు చెప్పెను, తతః హ ఏవ = అందువలననే, బ్రహ్మఇతి = బ్రహ్మము అని, విదాం చకార = తెలిసికొనెను.

ఇంద్రు డడిగిన ప్రశ్నకు 'మీకు కనబడిన యక్షుడు బ్రహ్మముగదా! ప్రపంచమున గనబడు మహిమయు బ్రహ్మమునకు జెందినదే. ఆ బ్రహ్మము మహిమవలననే మీకును మహిమ ఏర్పడినది' అని ఉమ బదులు చెప్పెను. అప్పు డా యింద్రు నకు తమ యెదుట నావిర్భవించిన యక్షుడు బ్రహ్మమని తెలిసెను.

ఇట నింద్రుడు జీవాత్మ యనియు, ఉమ బుద్ధి యనియు పూర్వమే తెలిపియుంటిమి. జీవాత్మకు బుద్ధిమూలమున బ్రహ్మము ప్రత్యక్షమగును. బుద్ధిని శుద్ధమొనర్చుకొనని మనుజులుబ్రహ్మమును దెలిసికొనజాలక తామే గొప్పవారనియు, తమకు మించిన మహిమగల పదార్థమొండు లేదనియు నెంచుదురు.

అట్టివారికి బ్రహ్మసాక్షాత్కారము కాదు. జీవునకు బుద్ధిమూలమువననే బ్రహ్మసాక్షాత్కారము కాగలదని యిందు సూచింపబడినది. "దృశ్యతే త్వగ్ర్యా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః'' అగ్రిమ–సూక్ష్మబుద్ధితోనే బ్రహ్మము ననుభవింతురని యందు వలననే యన్యత్ర చెప్పబడినది.

తస్మాద్ వా ఏతే దేవా అతితరామి
వాన్యాన్ దేవాన్, యదగ్నిర్ వాయు రింద్ర
స్తే హ్యేన న్నేదిష్ఠం పస్పర్శు స్తే
హ్యేనత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి. ౨౭-౨

అగ్నిః, వాయుః, ఇంద్రః=అగ్ని, వాయువు, ఇంద్రుడు-జీవుడు నను, దేవతలు, తే హి=ఆ ముగ్గురే, ఏనత్=ఆ కనబడిన యక్షరూప బ్రహ్మమును, నేదిష్ఠం = మిక్కిలి దగ్గఱగా, పస్పర్శుః=స్పృశించిరి, తే హి=వారే, ఏనత్ = ఈ యక్షుని, బ్రహ్మేతి = బ్రహ్మమని, ప్రథమో విదాంచకార = మొదట తెలిసికొనిరి, తస్మాత్ = అందువలన, యత్ ఏతే దేవాః=అగ్ని, వాయువు, ఇంద్రుడు నను ముగ్గురు, అన్యాన్ దేవాన్ = ఇతర దేవతలను, అతితరామివ = మించినవారై యున్నారు.

అగ్ని, వాయువు, ఇంద్రుడు నను దేవతలు మిక్కిలి సమీపముగ బ్రహ్మమును ముందుగ దెలిసికొనినవి కావున నవి యితర దేవతల కన్నింటి కంటెను శ్రేష్ఠములు.

మన శరీరమునందలి యింద్రియములు అన్నియు దేవతలనబడును. అందులో చక్షురింద్రియము అగ్నికి, త్వగింద్రి

యము వాయువునకు సంబంధించినవి. ఇంద్రియములలో నియ్యవి ముఖ్యములుగా నెంచబడును. పంచభూతములలో నగ్నివాయువులు కూడ ముఖ్యములుగా జెప్పబడును.

తస్మాన్ వా ఇంద్రోఽతితరా
మి వాన్యాన్ దేవాన్
స హ్యేన న్నేదిష్ఠం పస్పర్శ
స హ్యేనత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి. ౨౮-3

ఇంద్రః = ఇంద్రుడు-జీవాత్మ. ఏనత్=తమ యెదుట నావిర్భవించిన యక్షుని, నేదిష్ఠం=మిక్కిలి దగ్గఱగా, పస్పర్శ= స్పృశించెను. స హి=ఆ జీవుడే, ఏనత్=యక్షుని, ప్రథమః = ప్రథమమున, బ్రహ్మ ఇతి=బ్రహ్మమని, విదాంచకార=తెలిసికొనెను. తస్మాత్ = అందువలన, వై=నిశ్చయముగ, అన్యాన్ దేవాన్=ఇతరములగు నగ్న్యాది దేవతలను, అతితరామ్ ఇవ= మించినవాడు.

అగ్ని, వాయువు, ఇంద్రుడు నను నీ మూడు దేవత లందును ఇంద్రుడు-జీవాత్మ బ్రహ్మమును ముందుగా నతి సమీపమున జూచి, తెలిసికొనినవాడు, కావుననే జీవుడు తక్కిన జడదేవతలయిన అగ్ని మున్నగువానికంటె గొప్ప వాడు-ఎక్కువ మహిమ గలవాడు. లోకమున గల జడపదార్థ ములలో అగ్ని, వాయువు శ్రేష్ఠము లనియు, వానికంటెను జీవాత్మ చేతనము కావునను, బ్రహ్మము నెఱుగగల బుద్ధి యుక్తమగుట వలనను మిక్కిలి శ్రేష్ఠమనియు తెలిసికొన వలయును.

తస్యైష ఆదేశో య దేతద్
విద్యుతో వ్యద్యుతదా౩ ఇతీతి
న్యమీమిషదా౩ ఇత్యధిదైవతమ్. ౨౯-౪

తస్య=ఆ బ్రహ్మముయొక్క, ఏషః ఆదేశః=ఉపదేశము ఇదియే, విద్యుతః=విద్యుత్తుయొక్క, వ్యద్యుతత్ ఆ=ప్రకాశము వలె, ఇతి=అనియు, న్యమీమిషత్ ఆ=కన్నురెప్ప వాల్చినట్లు, ఇతి = అనియు, అధి దైవతమ్ = దేవతలకు సంబంధించిన విషయము, ఇతి=ఉండునని తెలియవలయును.

కన్ను తెఱచినపుడు వస్తువులు కననగును. అది మూయ గానే వస్తువులు కనిపింపవు. అట్లే క్షణమాత్రము మెఱపు మెఱసినపుడు కన్నులు మిఱుమిట్లు గొనిపోవును. విద్యుత్తు క్షణమాత్రమే ప్రకాశించును. అట్లే బ్రహ్మ ప్రత్యక్షము కూడ నుండునని పై ప్రసంగమును బట్టి గ్రహింపవలయును. బ్రహ్మము మొదట యక్షరూపమున బ్రత్యక్షమయ్యెను. మరల నంతర్హితమయ్యెను. బ్రహ్మము నెఱుంగ బ్రయత్నించు జీవులకు బుద్ధి ద్వారమున నయ్యది ప్రథమమున క్షణికముగా ననుభవమునకు వచ్చును. నిరంతరాభ్యాసము మూలమున బ్రహ్మానందమును చిరకాల మనుభవింప సాధ్యమగునని భావము. నేత్రకాంతికంటె విద్యుత్కాంతి, దానికంటె బ్రహ్మతేజస్సు విలక్షణ మనియు నెఱుంగునది.

అథాధ్యాత్మం య దేతద్
గచ్ఛతీవ చ మనోఽనేన
చైత దుపస్మర త్యభీక్ష్ణం సంకల్పః. ౩౦-౫

అథ=అధిదైవతము-దేవతలకు సంబంధించిన ఉపదేశమునకు తరువాత,అధ్యాత్మం=శరీరాంతర్గత విషయము చెప్పబడుచున్నది. యత్. ఏతత్, మనః=ఈ మనస్సు-అంతఃకరణము, గచ్ఛతి ఇవ = బ్రహ్మమును గూర్చి వెళ్ళుచున్నట్లు ధ్యానమొనర్పవలయును. అనేన చ = మఱియు నీ మనస్సుతో, ఉపస్మరతి = అతి సమీపముగ బ్రహ్మమును స్మరింపవలయును. సంకల్పః=సంకల్పము, అభీక్ష్ణమ్ = మాటిమాటికి పలుమాఱు - నిరంతరము చేయుచుండవలయును.

ఇంతకు పూర్వమున నధిదైవతము వర్ణింపబడినది. ఆఖ్యాయికా రూపమున బ్రహ్మాండమునగల తత్త్వములు బోధింపబడినవి. ఈ బ్రహ్మాండమున దివ్యగుణములు గల పదార్థములన్నియు దేవత లనబడును. ఆ దేవతలు జడములు, చేతనములు నని రెండువిధములు. ఈ బ్రహ్మాండమున గల పదార్థములలో జీవులు, బ్రహ్మము తక్క మిగిలినవన్నియు జడదేవతలుగా నెంచబడును. పృథివ్యాది పంచభూతములు, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, ఇంద్రియములు, దశప్రాణములు, మనస్సు మున్నగునవన్నియు జడదేవతలు. జీవులు, బ్రహ్మము చేతనదేవతలు.ఇవియన్నియు కలిసియే బ్రహ్మాండ మనబడును.

జడదేవతలలో అగ్ని వాయువులు శ్రేష్ఠములు. విశేషశక్తిమంతములు. ఈ జడపదార్థములకన్నింటికంటెను చేతనములైన జీవులు శ్రేష్ఠములు. అధికశక్తిమంతములు. కాని, వానికంటెను బ్రహ్మము శ్రేష్ఠము. బ్రహ్మమునకు సమానమైన

దేవతకాని, అధికమైన దేవతకాని మఱియొకటి లేదు. కావున నయ్యదియే జీవులకు దెలియదగినది; పూజింపదగినదియును. ఇట్లు వివరింపబడిన విషయమంతయు నుపనిషత్తులలో అధిదైవత మనబడును. బ్రహ్మాండవిషయమని భావము.

జీవుల శరీరమునకు సంబంధించిన విషయము అధ్యాత్మ మనబడును. బ్రహ్మము ఇంద్రియముల కందని వస్తువని ప్రథమముననే చెప్పబడినది, సాధారణ మనస్సునకు కూడ నది యందదనియు వర్ణింపబడినది. కాని, బ్రహ్మము నెఱింగి, యానందము ననుభవింప గోరువారు, మనస్సును బాహ్యవిషయముల నుండి మరలించి బ్రహ్మము వైపునకు నడపవలయును. మాటిమాటికి బ్రహ్మము నెఱుంగ సంకల్ప మొనర్చుచు నందే దృఢవృత్తి కలుగునట్లు యత్నింపవలయును. ఇయ్యదియే యధ్యాత్మ మనబడును.

తద్ధ తద్వనం నామ
తద్వన మిత్యుపాసితవ్యం
స య ఏత దేవం వేదాఽభిహైనం
సర్వాణి భూతాని సంవాంఛంతి. ౩౧-౬

తత్ హ=పూర్వము వర్ణింపబడిన బ్రహ్మమే, తద్వనమ్ నామ=మోక్షము నభిలషించువారికి సేవింపదగినదికదా! తత్=అబ్రహ్మమును, వనమ్, ఇతి=వనము-సేవింపదగినదని, ఉపాసితవ్యం = ఉపాసింపవలయును. సః యః = ఏ పురుషుడు, ఏతత్=ఈ బ్రహ్మమును, ఏవం వేద=ఇట్లు ఉపాసింపదగినదని తెలిసికొనునో, అభిహ = సర్వదిశలందు నా బ్రహ్మమును

గుర్తించునో, ఏనం = అట్టివానిని. సర్వాణి భూతాని=సమస్త ప్రాణులు, సంవాంఛంతి=బాగుగ ప్రేమించును.

పూర్వము వర్ణింపబడిన దేవాధిదేవత యగు బ్రహ్మము ముముక్షువుల కుపాసింపదగినదై యున్నది. సేవింపదగినదై యున్నది. ఇట్టి బ్రహ్మము నెఱిగినవాడు బ్రహ్మమంతట నున్న దని తెలిసి యుపాసించును. ఆ యుపాసకుని నెల్లరు ప్రేమింతురు. ఏ ప్రాణియు నతనిని ద్వేషింపదు. బ్రహ్మము నుపాసించు భక్తుడు బ్రహ్మము నెల్లప్రాణు లందును సమముగా వ్యాపించియుండుటను గుర్తించి, సర్వప్రాణుల నతడు ప్రేమించును. అట్లు ప్రేమించు భక్తుని ప్రాణు లేల వాంఛింపవు ?

ఉశనిషదం భో బ్రూహీ త్యుక్తా
త ఉపనిషద్ బ్రహ్మీ వావ
త ఉపనిషద మబ్రూమేతి. 3-౨-౭

భోః = ఓ యాచార్య, ఉపనిషదం = బ్రహ్మవిద్యను, బ్రూహి = చెప్పుము, ఇతి=అని, శిష్యుడు ప్రశ్నించెను, తే= నీకు, ఉపనిషత్=బ్రహ్మవిద్య, ఉక్తా=చెప్పబడినది, తే=నీకు, ఉపనిషదం=బ్రహ్మవిద్యను, వావ=నిశ్చయముగ, అబ్రూమ= చెప్పితిమి, ఇతి = ఇకమిగిలినదేదియు లేదని గురువు - ఆ చార్యుడు అనెను.

గురుశిష్య సంవాద రూపమున నీ యాఖ్యానము ప్రారంభింపబడినది. బ్రహ్మమును గూర్చి యుపదేశించుటయే యీ కథకు ప్రయోజనము. బ్రహ్మముయొక్క స్వరూపము, మహ

త్త్వము నన్నియు వివరింపబడినవి. బ్రహ్మమును గూర్చి యింకను చెప్పవలసినది యేమైన నున్నపక్షమున నదియు నుపదేశింపుడని శిష్యుడాచార్యుని ప్రశ్నించెను. ఆచార్యు డందులకు "అంతయు చెప్పబడినది. ఇక నుపదేశింపవల సిన దంతగా నేమియు లేదు'' అని సమాధానము చెప్పెను.

తస్యై తపోదమః కర్మేతి
ప్రతిష్ఠా వేదాః సర్వాంగాని
సత్య మాయతనమ్. 33-ర

తస్యై = ఆ యుపనిషత్తు కొఱకు - బ్రహ్మవిద్యాప్రాప్తి కొఱకు, తపః=తపస్సు, దమః = దమము, కర్మ = కర్మము, ఇతి=ఇవి యన్నియు-సాధనములు, ప్రతిష్ఠా=సత్కార్యానుష్ఠా నముచే గలుగు యశః ప్రాప్తి, వేదాః = వేదములు, సర్వాం గాని = శిక్షావ్యాకరణాది సర్వాంగములు, సత్యం = సత్యము, ఆయతనమ్=అన్నింటికి నిలయమగును.

పూర్వ ముపదేశించిన బ్రహ్మవిద్యాప్రాప్తికి తపస్సు, దమము, కర్మము నను మూడును సాధనములు.

మానావమానములు, సుఖదుఃఖములు, శీతోష్ణములు, హానిలాభములు మున్నగు జంటలు ద్వంద్వము లనబడును, వీనిని సహించుట తపస్సగును. బ్రహ్మచర్యాది వ్రతములును తపస్సులో చేరును. వీనివలన శారీరిక శక్తులన్నియు స్వాధీన ములో నుండును.

మనస్సును స్వాధీనములో నుంచుకొనుట దమ మన బడును.

వేదశాస్త్రములందు విధింపబడిన అగ్నిహోత్రాది శుభ కర్మములు కర్మశబ్దముచే గ్రహింపనగును. ఇవి యన్నియు బ్రహ్మవిద్యాప్రాప్తికి పునాదుల వంటివి. వీనివలన మనుజునకు ప్రతిష్ఠయు గలుగును. ఈ తపస్సు మున్నగువాని యాధారమున ఋగాది వేదములు, శిక్షాది – అంగములు నన్నియు నధ్యయనము చేయుగలశక్తి లభించును. ఇతరులచే వానిని జదివించుటకును యోగ్యత కలుగును.

ఈ పునాదులపై సత్యమను భవనము నేర్పఱప వీలగును.

సత్యాచరణము, సత్యవాదనము, సత్యప్రాప్తి సత్యపదముచే జెప్పనగును. సత్యమున సర్వము ప్రతిష్ఠితమై యున్నది. మనోవాక్కాయములతో సత్యాచరణము బ్రహ్మప్రాప్తికి ముఖ్య సాధనము.

వెలయంగ నశ్వమేధంబులు వేయును
ఒక్క సత్యమును తులనిడి తూచిన
సత్యము వలనస ములు సూపు
.................................

అని శిష్టులు సత్యమహిమను గొనియాడిరి.

యోవా ఏతా మేవం వేద
అపహత్య పాప్మాన మనంతే
స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి. 3४–౯

యః=ఏ మనుజుడు, వై=నిశ్చయముగ, ఏతాం = ఈ కేనోపనిషన్నామక బ్రహ్మవిద్యను, ఏవం వేద=ఇట్లు తెలిసికొనునో, సః=అతడు, పాప్మానం=పాపమును, అపహత్య=నశింపజేసి, అనంతే=నాశములేని, స్వర్గే=ఆనందమయమైన, జ్యేయే లోకే=అన్నింటికంటె గొప్పదియగు పరమాత్మయందు, ప్రతితిష్ఠతి, ప్రతితిష్ఠతి=శాశ్వత స్థితిని బొందును.

పైన వివరించినట్లు కేనోపనిషత్తు నెఱింగిన విద్వాంసుడు జన్మజన్మాంతరములనుండి సంచితమయిన కల్మషమును నశింపజేసికొని, ఆనందస్వరూపమగు బ్రహ్మమునందు స్థితిని సంపాదించి యానందించును. జన్మ మరణబంధనమునుండి విముక్తుడగును.

కేనోపనిషత్తు సమాప్తము.

ఓమ్ తత్ సత్



# "కళాప్రపూర్ణ" పండిత గోపదేవశాస్త్రి



జననము : క్రీ.శ. 1896
జన్మస్థలము : కూచిపూడి, తెనాలి తాలూకా
జననీజనకులు : అంబమాంబా రామయార్యులు
విద్యాభ్యాసము : కూచిపూడి, అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు
వృత్తి : వైదిక ధర్మ ప్రచారము, వైదిక సంస్కార వ్యాపకత
అభిమాన విషయములు : షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గప్రావీణ్యము.

స్థాపకులు : అంబా దర్శన గ్రంథమాల, కూచిపూడి, అంబా రామార్య సత్యార్థ ప్రకాశట్రస్టు, సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్యసమాజములు.

సన్మానములు : 1. "కళాప్రపూర్ణ" - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం.

2. రూ. 10,000 "మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్" న్యాస్, ఆర్యసమాజం, ఫులేరా

3. రూ. 5,000 ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.

4. రూ. 25,001/- వేదవేదాంగ పురస్కార్, ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి.

రచనలు, అనువాదములు : సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్య భాస్కరము I, II, III, వైదికవినతి I, II, వైదిక దినచర్య, న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, వేదాంత దర్శనములు; ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు; ఆస్తికవాదము, అర్థధర్మమీమాంస, సంస్కారవిధి, భగవద్గీత, ఏసుక్రీస్తు రహస్యజీవనము, పూజ, వైదిక పర్వపద్ధతి, అపశూద్రాధికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25 (నాలుగు భాగాలలో) చిన్నవి, పెద్దవి కలిపి ఆఱువదికి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు వీరొక్కరే.